శ్రీ

# వేంకటేశ్వర విజ్ఞప్తి

గ్రంథకర్త.


శికింద్రాబాదు.

కొండా వీరయ్యా అండ్ సన్సుగారి భారతీ ముద్రాక్షరశాల
యందు ముద్రింపంబడియె.

1936.




వెల 0-4-0

# పీఠిక

సరసులారా!

ఈచిన్నిపొత్తమునం దిత్తఱిఁగొలఁది పద్దెంబులుచేర్పఁ బడినవి. ఇందన్యదేశ్య పదంబు లనుకరింపఁబడి కావలసినట్లుప యోగింపఁబడినవి. ఇది సత్కవి సంప్రదాయసిద్ధంబని మీరె ఱింగినదియ. ఇందు వేదశాస్త్రవిహితంబగు మనసంఘమునందు గాలేయకాలమహిమచే బయలుదేరి యత్యంతహానింగూరు దురాచారంబులను నిరసించుచు గొన్నిపద్యంబులును నైహికాముష్మిక సుఖదాయకంబగు భగవత్కథంగూర్చికొన్ని పద్యంబులును జేర్పబడినవి. ఇందలిగుణదోషంబులు మీకే క్రమంబుగా విశదంబయ్యెడి. ఇందుముద్రాపక లేఖక ప్రమాద ములవలన బడిన తప్పులంగొన్నిటిని సవరించి తుదినిముద్రింపించితిని. మఱియునున్నచో సవరించుకొనఁ బ్రార్థితులు. ఈరెండవ కూర్పును మాత్రము ముద్రించి ప్రకటించుకొనిన మ॥ రా॥ శ్రీ॥ పబ్బాశంకరయ్యగారును. మారుతిబుక్కుడిపో వారును భగవదనుగ్రహపాత్రులై యైహికాముష్మికసుఖంబులంబొం దెదరుగాత.

సుధీవిధేయుఁడు

4-1-1936
సికింద్రాబాద్ దక్కన్

చివుకుల అప్పయ్యశాస్త్రి

# విషయ సూచిక


| | పుట |
|---|---|
| మంగళాచరణ ప్రార్థనములు. | 1 |
| నవీనులు. | 5 |
| జాతులు. | 9 |
| బ్రాహ్మణేతరులు. | 11 |
| బ్రాహ్మణులు. | ,, |
| యజ్ఞము. | 12 |
| జంతుబలి. | 13 |
| గోవు. | ,, |
| శ్రాద్ధములు. | 14 |
| విగ్రహారాధనము. | 16 |
| కన్యావరవిక్రయములు. | ,, |
| శిశువివాహములు. | 17 |
| సక్రమవివాహములు. | ,, |
| బాల్యవివాహ రజస్వలావివాహములు. | 18 |
| విధవావివాహములు. | 20 |
| స్త్రీవిద్య, స్త్రీస్వాతంత్ర్యము. | 22 |
| అస్పృశ్యతానివారణము. | 23 |
| శాసనసభ. | 26 |
| కాంగ్రెసు, అసహాయవాదులు. | ,, |
| ప్రస్తుతపారిభాషికపదములు. | 30 |
| సంస్కృతాంధ్రభారతములు. | 31 |

పుట

| | |
|---|---|
| హిందీభాషాపరిచారము. | 32 |
| నానావిషయములు. | 33 |
| ధార్మికపరిబోధము. | 40 |
| ధర్మసేవక పత్రికాప్రశంస. | 43 |
| భగవదవతారములు. | 44 |
| తిరుపతి వేంకటేశ్వరస్వామి ప్రార్థనము. | 57 |
| ఉపసంహారము. | 63 |




శ్రీపరమేశ్వరాయనమః

# వేంకటేశ్వర విజ్ఞప్తి.

---

ఉ॥ శ్రీరమణీమణిప్రణుత। సింధు సుతాది సతీ వితానశృం
గార మనోహరోక్తులను । గర్ణము లారఁగ నాలకించుచు
న్నారుతరోరుడోలను మ । నఃప్రియమానటులూగుచార్తనా
గారవముల్ సెవిన్ బడద ।యన్ జనిప్రోచినకృష్ణుఁడోముతన్॥

ఉ॥ ఓపరమాత్మ!యెల్లెడల । నుండిగ్రహించెదవంచెఱుంగమిన్
బాపము బుణ్యమంచనక । భావమునందున దోఁచినట్టులే
యేపనులాచరించితినో । యెట్టికృతుల్ బొనరించు చుంటినో
యేపనిఁ జేయ నుంటినొకో?। యేమియెఱుంగను వేంక॥

చం॥ తుద మొదలేమిగన్పడని । దోషమహాటవిమధ్యమందు నే
ను దగులుకొంటిఁగష్టముల । నొచ్చు చునుంటినిగంటిభీతినా
యెద నిలుచుండలేనెటుల । నీయఘ కాననమంతరించునో
యదివెసఁజెప్పుమోయిపర । మార్థిమనోహర! వేంకటేశ్వరా॥

చం॥ కలుషవనంబుఁద్రుంచుటక । ఖండసుదర్శనమియ్యవయ్యా
నా
కలుషమహాగ్నినార్పుటకుఁ । గా కరుణారసధారఁ జిల్కవే
యలకలుషాబ్ధి దాఁటుటకు । నబ్జపురందర వందితాభిధా
నలలిత కీర్తనాత్తమతి ।నౌకనొసంగవె! వేంకటేశ్వరా॥

ఉ॥ డబ్బుహుళక్కి విద్యయును । డాబు మనంబును క్రోతిమాట
యో
దబ్బ అసజ్జనాశ్రయమొ । తక్కువయెక్కువ దుర్జనాశ్రయం
బుబ్బుటయుబ్బరంబు పను । లోపని లేనివి యోర్పుసున్న యో
యబ్బ! యిఁకెట్టులన్ గనెద । నంతఘనున్నిను వేంకటేశ్వరా॥

చం॥ మును పెపుడోకు చేలునకు । బుత్తినొసంగితివంట భీష్ముపై
నెనరున నుంటివంటనరు । నిన్ జయశీలునిఁ జేసితంటనె
మ్మనమున మెచ్చి ద్రోవదికి । మానముదక్కఁగ సల్పితంటవా
నినినను గాచునత్తఱిని । నిక్కమటందును వేంకటేశ్వరా॥

చం॥ భయముజనింపవాతకఫ । పైత్యరుజల్ గడుఁగప్పఁ జెప్పనే
మియుఁబలుకంగ లేనితఱి । మేను వడంకుచునుండగుండెనీ
రయిచనఁగాలకింకరులు । రమ్మనిపిల్చిన నిన్దలంచెదన్
స్వాయముగ నీటముంచెదవో? । పాలనుముంచెదో ?వేంక॥

ఉ॥ కోపము హెచ్చుచుండె జన । కోటులు లోటుగఁ జూచు
చుండుటన్
దాపము వృద్ధిగాఁ దొడఁగె । దానఁగఠోరతఁ బూనియెంతయోన్
సేపటి కొడ్లకొంపలకుఁ । జిచ్చును బెట్టఁ దలంచుచుంటినీ
పాపము లెల్లు రోవు? నెటు । భవ్యుఁడ నౌదునో? వేంకటేశ్వరా॥

చం॥ సడలకమున్నె దంతములు । శైత్యము గ్రమ్మకమున్నె
పల్కుల౯
గడిబిడిలేకమున్నె యొక । కఱ్ఱనునడ్గకమున్నె పాదముల్
దడబడకుండనున్నపుడె । దార్ఢ్యముదప్పకమున్నెనిన్నుఁబొం
దెడిపనులన్నిటి౯ సలుపు । తృష్ణనొసంగవె! వేంకటేశ్వరా॥

ఉ॥ చిన్నతనంబునందుఁ గపి । చేష్టలఁ జేసితి జవ్వనంబునం
దన్నరమించి కాలమును । వ్యర్థము చేయుచునుంటిముందునా
సన్నమదీయవృద్ధతను । సంచితపాపవినాశకున్నిను౯
సన్నుతి సల్పునట్లు నను । సల్పు మనల్పుడఁ వేంకటేశ్వరా

ఉ॥ తల్లివి నీవె తండ్రియును । దాతవు నీవె విభుండవీవె నా
చెల్లెల వీవె చుట్టము సు । శీలగురుండును భ్రాత వీవె భా
సిల్లున దెల్ల నీవెయని । చిత్తమున౯ దృఢరీతి నమ్మి న
న్నొల్లక యుందు వేమొ యది । యుక్తముగాదుగ వేంక॥

చం॥ తొలిపలుకు౯ బఠింతుననఁ । దోచదు దాన మొనర్తునందు
నా।
కలిమియులేదుగంగమునుఁ । గంగమకించిన శక్తి లేదునా
కలుషము లెట్లు బోవు నినుఁ । గాంతు నెటుల్ ననుఁ గాచి
భక్తవ
త్సలుఁడను పేరు సార్థకము । సల్పవె! నిల్పవె! వేంక॥

ఉ॥ సారములేని సంసృతికి । సారసలోచన నోర్తు నిచ్చిసం
సారముఁజేసికొమ్మనన । సారయదృచ్ఛనుబూనిమీనుడిన్
దూరమొనర్చి సర్వవిధ । దోషము లొందితి నైననాకు నీ
చేరికగూర్చినట్టయినఁ । జెందుదు వానిని వేంకటేశ్వరా॥

ఉ॥ శైవులుసాంబమూర్తియని । సౌరులు సూర్యుఁడటంచు వైష్ణవుల్
శ్రీవిభుఁడంచు శాక్తులును । శ్రీశివశక్తియటంచుభిన్నతన్
భావనసేయుచుందురిది । బాగుగఁజూడఁగనిన్ని రూపులున్
నీవియకావెయెల్లెడల । నిండియు నుండవె వేంకటేశ్వరా॥

ఉ॥ ఏరెవరెట్టి రూపముల । నెట్టి యభిఖ్యల నుంచి నీకు జో
హారులఁజేయుచుండెదరొ । యట్టియభిఖ్యల నట్టిరూపులన్
వారికి దర్శనం బిడి య । వారిగ వారల కోర్కి దీర్తు వే
యోరిమియింతనీకలరు । చుండుటవర్ణ్యము వేంకటేశ్వరా॥

ఉ॥ ద్రవ్యము రూపముంగులము । దక్షవిపక్షి విమర్దనక్రియా
దివ్యబలంబుమాన్యతయు । ధీరతపొందితి మెన్నియుండినన్
సేవ్యమహానుభావ నినుఁ । జేరనిచో నవివ్యర్థమౌఁ జుమీ
యవ్యయసౌఖ్యమెట్లొదవు । నార్తజనావన వేంకటేశ్వరా॥

ఉ॥ పుట్టుకఁ బుట్టరెవ్వరును । బుట్ట సతీసుత బాంధవాదులుఀ
బుట్టుచునుండ్రుమీరయినఁ । బోవుడి వేళను వెంటనంటి యి
క్కట్టులఁ బాపరా బ్రతుకు । కాలము నందు గడించినట్టి నీ
చుట్టరికంబో వెంటఁబడి । చూపదె సద్గతి వేంకటేశ్వరా॥

చం॥ ధనమువసించునందనుక । దారసుతాదులుస్తుటుట్టిప్రే
మనుగనుచుందురాధనమె ।మాయము జెందినతత్క్షణంబునం
దునశవముఀశ్మశానమున। ద్రోసిగృహంబులఁ జేరువారిఁబో
లెనువిడుచుందురియ్యది మ । లిమ్లుచకృత్యము వేంక॥

ఉ॥ రాతిరి నాతిపై నధిక । రాగము రంజిల రోఁత పాతెఱఀ
బూతమటంచు నొక్కుదురు । ముచ్చటకుందగనట్టి యెన్ని
యో।
సేతలుసత్రిక్రియాళులని । చేయుచునుందురు కాని మంచి వో
నీతలపుల్ దలంపరిది । నింద్యముగా దొకో! వేంకటేశ్వరా

—:నవీనులు:—

ఉ॥ ప్రస్తుతమందు వేదములఁ । బాడుపటంచుఁ బఠింపకుండ న
భ్యస్తము సేయుచుండిరల । యాంగ్లకలావిధిపాట్టకూటికై
శస్త్రమె యిప్పుడద్ది యిఁక । ఛందము లౌహిక పారమార్థిక
ప్రస్తుత సౌఖ్యదంబులగు । బాటలుగావొకో వేంకటేశ్వరా॥

ఉ॥ వేదములన్న నేమొ శ్రుతి। విశ్రుతధర్మము లేవొ ధర్మశా
స్త్రాదులనంగ నేమొయిను। మంత యెరుంగనివారుహూణవి
ద్యాధృతిగల్గువారె శ్రుతి। ధర్మవిచక్షణ దక్షులంచు నీ
మేదినిబోద్ధలెరిదిను। మీ!కనుమీ! యిది వేంకటేశ్వరా

ఉ॥ ఏ, బి, సి, డీ, యనంగనెవో। యింగ్లీషుముక్కలునాల్గు
నేర్చి యెం.
యే, బి, ఎలెల్బి, ఫైనటుల। హ్యాటును కోటును సూటు
బూటులన్
డాబగు డ్రెస్సువేసియు బ। డాయిలఁగొట్టుచుధర్మదూరులై
బాబులుసల్పు కార్యములఁ। బాడువటందురు వేంకటేశ్వరా॥

చం॥ తిలకవిహీనఫాలమొక। తీరుగ లేని బడాయి వేసముల్
దెలియగ రాని బాసయుశ్రుతి। క్రియలన్ దెగదూరుధైర్యమ
న్యులఁగల ధర్మపద్ధతుల। నొందుతలంపు లకారణవ్య ధా
కలహము గూర్చువారెవరొ। కైకొని చెప్పవె వేంక।

ఉ॥ మండనమండితంబు సుమ। మాపరిశోభిత మజ్జనానవో
ద్దండయుతం బఖండము ప్ర। ధానముసర్వకళానిధానమిఁ
గ్లండున విద్య నేర్వఁజని। కంజళ మద్యము లాని "లేడి"తో
నుండెడిబాపలుండిరట!। యొప్పనె?తప్పగు వేంకటేశ్వరా।

ఉ॥ సూటును, బూటు, కోటులను । షోకుగ వేసియు "సైకి"
 లెక్కియే।
 "హోటలో" చేరి మిత్రుల నాలో! మయిడియ్యరు ఫ్రెండ
 టంచునే
 మాటలలోలోటు లేక య। సమంజస వైఖరి నాడి ధర్మముల్
 దాఁటి భుజింతు రేదో, యిది । ధార్మికకృత్యమె? వేంక

ఉ॥ రైలునఖర్డుక్లాస్టికెటు । ద్రవ్యమొసంగి గ్రహించియెక్కియే
 యాలహబాదుకో గయకో । హైదరబాదునకో మరేడకో
 యోలిగబోవుచుఁ దురక । లుమ్ములు వేసినచోట్ల చద్దులఁ
 జాలుగనుంచి మెక్కెడిర । సాసురులుండిరి వేంకటేశ్వరా॥

ఉ॥ బాపలు గొందరీకలినిఁ । బాచిమొగంబును దోమకుండ
 బెడ్।
 కాపి, టి, కోకొ, బిస్కటులు, డి । కాక్షనటంచెవో యాని
 పూర్తిగాఁ।
 దేప్రుల, బుచ్చుచుండు మరి । రిఫ్రెషుమెంటుల బ్రాండి బీ
 రెవో।
 యేపున దాగుచుంమరిది । యెంతయు నోగతి వేంక

చం॥ సిగరెటు, బీడి, చుట్టలను । జేతుల మూతుల, బట్టి త్రాగు
చా।
పొగ దమనోటముక్కులను । బోవఁగ జేసియునంటు లేక యే
మొగమును మీసల న్దుడిచి । ముచ్చట లాడుచు నుందు రి
క్కొందఱే
జగతిసురుల్ కటా! యెటులఁ । జక్కగనుందురు వేంకటేశ్వరా॥

ఉ॥ పెండిలి యై నిషేకమును । పిల్లల నల్వురగాంచి నల్వదేం
డ్లుండిన శూద్రవృద్ధునక । యుక్త విధి న్వడుగు న్బొనర్చి బా
పండని వానినిం బిలిచి । పండిత వర్యుల మంచు నిక్కను
ద్దండులు కొందఱుండిరిది । తద్జ్ఞులకృత్యమె వేంకటేశ్వరా॥
ఇ

చం॥ గడబిడఁ జేసె గీతల జ । గద్గురు శంకర శంకరార్యులం
చెడదఁదలంచి కొందరిపు । డిచ్చకునచ్చినయట్లు భాష్యముల్
జెడబడ వ్రాసి రిద్దిగను । శిష్టులు దూఱరె? చూడ నక్కటా
క్కడమరినాగలోకమెట । గాంచిచునుండెడి వేంకటేశ్వరా॥

ఉ॥ పెండిలిదండియుత్సవము । బెద్దలు శ్రద్ధగఁ జేయుచుండఁగా
నొండు జనుండు దానిఁగని । యోర్వక గర్వనిబద్ధ బుద్ధి మై
పెండిలికింతవిత్తమును । బెట్టుటయొప్పునె? హానుభాతి షే
క్షాండును సల్ప రాదె యదె । యర్థ మటంచను వేంక॥

ఉ॥ గుండెలుబ్రద్దలౌనటుల । గూఁతలువాఁతలవాగిఁ నేఁతులా
గుండమునందుదంపతులు । గూడుదినాంతముదాఁకవీడి బ
ల్దండిగబోఁతురియ్యదియ । ధర్మముగాదొకో? హూణురాణషే
క్ష్వాండునుసల్పగాఁడెయని । యందురుగొందరు వేంకటేశ్వరా॥

ఉ॥ చాటునఁజెడ్డచేతలను । సల్పెడిమష్టులెతాము గ్రమ్మఱ్
నేటున మంచి సంగతుల । నిర్మల వేషవిభూషి తాత్ములై
పాటకివచ్చినట్టులుగఁ । బల్కిన, వారలుగూడ వంద్యులై
నీటుగ నుందురీ కలివి । నీతి యిదేగద! వేంకటేశ్వరా॥

ఉ॥ 'అంగడినిఱ్ మిఠాయిఁగడు । పార భుజింతురు బ్రాండిజింజరుఱ్
భంగునుసోడబుడ్డులను । బల్మఱుఁద్రాగుచునుండ్రుడబ్బుకై
దొంగతనంబుజేయుదురు । తుచ్ఛులఁ గూడుదురాలివీడి నీ
చాంగన కాలుబట్టెదర । ఘూటవినాశక! వేంకటేశ్వరా॥

చం॥ ధనమునకై స్వధర్మము ప । దంబున దన్నెదరన్యధర్మముల్
గొన వెనుదీయరంగనల । కుఱ్ వశులౌదుర భక్ష్యభక్షణం
బునొనరింత్రగమ్యగమ । ముఱ్ బొనరింతురుతల్లిదండ్రులఱ్
గనరుస్వకీయసౌఖ్యముల । గాంచరు లుబ్ధులు వేంకటేశ్వరా

* జాతులు, *

చం॥ గొనములఁబట్టివర్ణముల । గూర్పగనౌననికొందఱందురా
గొనములుబాల్యలౌల్యమునఁ । గూడినవా? నడిజవ్వనంబునం

దునలరునవ్వియా?ముసలి । తొక్కనుజిక్కనవా?మరేవి? వే
నిని గ్రహియించి జాతులను । నిర్మితిజేతురు వేంకటేశ్వరా॥

ఉ॥ చిన్నతనంబునందుఁగపి । చేష్టలఁజేయుటవానిఁ గ్రోతియం
చెన్నగనాను బ్రాయమున । నింతినిఁగూడుటవానిఁ బక్షియం
చెన్నగనాను వృద్ధతన । హీనముగానొక మూలనుంటచే
నన్నరుఁగూబగాఁదలఁపనౌ । నిదియర్థమె? వేంకటేశ్వరా॥

చం॥ తరుణివివాహతత్పరుఁడు । దక్షుఁడువైశ్యుఁడునైనగాంధిభూ
సురకులజాత ప్రౌఢయగు । సుందరికిన్ దనచిన్ని పట్టిక
బ్బురపడఁబెండ్లిజేయనొక । పుత్రుఁడుబుట్టెగయిట్టివర్ణసం
కరజను కేకులంబెటుల । గల్గునొ పల్కుమి వేంకటేశ్వరా॥

ఉ॥ జాతుల హెచ్చుతగ్గులు ప । సందుగలేవని కొందఱందురీ
రీతియెటుల్ వసింపదొకొ? । సృష్టి, యనేకభిదాత్మకంబుగా
దా! తగురీతిఁజూడుఁడిటు । ధర్మ, ధనాం, గబలా, యురాదులం
దాతత భేదముండెనుగ । దా. వగదాయక? వేంకటేశ్వరా॥

ఉ॥ జాతులు దేశవృద్ధులకు । శత్రువిధిన్ బ్రతిబంధకంబులై
బాత్రిగనుండెనంచిపుడు । పల్కుచునుందురుకొందఱొక్కటే
జాతిగనున్నయూరొపున । సంతతముల్ గలహింతు రేలకో
యాతరహాకు హేతువుదు । రాశయె కాదొకొ వేంకటేశ్వరా॥

ఉ॥ జాతులె దేశవృద్ధులకు । సత్యముగాఁ బ్రతిబంధకంబులేన్
జాతిని, భుక్తి, పంక్తి, గతి, । శయ్యను, బాసను, గూడనొక్కటే

రీతిగ నుండు నాల్మగలె। ప్రీతి నశింపగఁ బోరుచుందు రే!
యీతరహాతగాదలకు । నేమికతంబగు? వేంకటేశ్వరా॥

ఉ॥ పుట్టుకఁ బట్టి వర్ణములు పుట్టెనుగాని గుణప్రవృత్తులన్
బుట్టవుగిట్టవీవిధియ ।మోఘమువంధ్యము దాయభాగ సం
ఘట్టన దుష్టవాద ఘన। కానన తీక్షకుఠార మన్నిటన్
దిట్టమువైదికంబునయి । దివ్యముగాదొకో? వేంకటేశ్వరా॥

* బ్రాహ్మణేతరులు *

చం॥ ఘనులగువారుగొందఱల। కాశ్యపిదేవులు బ్రాహ్మణేతరా
ళిని నవమానమున్ సలిపి। లీలగ మేదుర రాజకీయ కా
ర్యనియతులై రటంచు నధి । కాగ్రహ మొందుచుఁ బూని
" నాను బ్రా
హ్మనసోసియేష"నుంచిరి గ। దామదరాసున వేంకటేశ్వరా॥

ఉ॥ పాఱులు శూద్రులం జెరచి। బాగుగవృద్ధినిగాంచిరంచు నీ
కారున నుండుపాదజు ల। కారణ వైరము బూని వారిపై
సారెకు సారెకాత్మబల। సంపదఁ గత్తి కఠారు లెంతయు
న్నూరుచునుండిరీరహిము । నున్ జెలరేగిరె? వేంకటేశ్వరా॥

* బ్రాహ్మణులు *

ఉ॥ భూసురులంట! పుట్టువునఁ ।బూతులెయంట! ప్రజాళియందున
గ్రేసరు లంట! వీరలకే । కించను గాంచక డబ్బునిచ్చి నే

దాసుఁడనంచుఁబల్కి యుఁబ|దంబులఁబట్టగ నొంనటంటహా!
మోసముమోసమిద్దియని | మూల్గిరిగొందఱు వేంక॥

ఉ॥ అందఱవోలెబ్రాహ్మణులు | నమ్మలకేజనియింతురన్న మే
యందఱమాడ్కిఁదిందురల | యాతపవర్షరుగాది బాధలం
దందఱ రీతి నుందురిక | నగ్రిఁజు లెట్లుల నైరి? వీరికే
ముందర నేలనర్చలని | మూల్గిరిగొందఱు వేంకటేశ్వరా॥

ఉ॥ అందరమించిధర్మముల | నగ్రజు లెక్కవదాల్చుటన్
శ్రుతుల్
బొందుట, దొల్తఁబుట్టుటను, | బూతవిరించిముఖంబునన్
జనిన్
జెందుట, బుద్ధియందునఁబ్ర|సిద్ధినిబొందుటశాంతమూనియా
నందమె బ్రహ్మమంచనుట | నాకులుగారొకొ? వేంక॥

* యజ్ఞము *

ఉ॥ కొందఱుశ్రౌతయజ్ఞములుగూడవృథాపశుహింసదూష్యమం
చందురుగానియీగురుద|యాళురుపత్యహమందుసూనలో
వందల కొల్ది నాలగొఱె|బత్తెల మేకలఁ జంపుచుండఁ దా
మందఱుజూచియున్ వినియు|నాపర దేలకొ? వేంకటేశ్వరా॥

ఉ॥ యజ్ఞములందుమేకలను | హత్యనొనర్చిగ్రసింతురంచులో
కజ్ఞులు గొందరందురిది | గాంచగభ్రాంతియె,సత్యమైనచో

ప్రాజ్ఞులొనర్తురే? ఫలము। బాగుగ మెక్కక యగ్ని వ్రేల్తురే?
యాజ్ఞిక రాజికర్థమిడి । హర్షముగూర్తురె? వేంకటేశ్వరా॥

ఉ॥ ఎయ్యది బ్రాహ్మణత్వమున । హీ[illegible]ల్పసమర్థమదెయ్యదో
దెయ్యది దేశసంపదకు । నిక్కగనుండెనొ శస్త్రవైద్య సా
హాయ్యకరంబొ యెద్ది హరి । యంచు శ్రుతిన్ బ్రతిపాద్య
మదెయ్యదో
యయ్యది యజ్ఞమేగద సు। రాళిమనోజ్ఞము వేంకటేశ్వరా॥

* జంతుబలి *

చం॥ జనతతి భక్తి శక్తికయి । సల్పెడి కార్యములందు జం
తునివహహింస దూష్యమని। దూఱుటకందగ దార్యులౌ పలం
బునుమును దామె మెక్కుటను । బూర్తిగమాని యనంతరం
బునన్
జనులు భుజింపనట్టులుగ। సల్పుట మంచిది వేంకటేశ్వరా॥

* గోవు *

చం॥ హరి, ముఖశృంగజిహ్వలను, । నంఘ్రుల వేల్పులు; గుక్షిన
గ్ని; నే
త్రులన శశాంకుఁ; దంసమున। ధూర్జటి; పేడను లక్ష్మి, చిల్లులన్
గరువలి, చంద్రపాణి, నయ। నంబుల సూర్యుడు, దోఁకధర్మువ
య్యురురుచి సిద్ధి, మూవులిటు । లొప్పుచునుండెగ వేంకటేశ్వరా॥

ఉ॥ పంచితమందుఁ గీరితియుఁ । బాలను బ్రహ్మ, తమోరుహంబు
లన్

బ్రాంచితకర్మ, తోలునద । పంబును డెందము నందునన్ భగా
ఖ్యాంచితనిర్జరుండు, నఖి । లాంగములందుఁ జరాచరంబులున్
గాంచి వసించునాలఁదమి । గాఁగనుటొప్పదె? వేంకటేశ్వరా॥

ఉ॥ పాలనొసంగి బిడ్డలను । గాపల, రోగులఁ బ్రోచుచుండుటన్
మాలిమిఁ బంచితంబు నిడి । మానవులన్ శుచి జేయుచుండు ట
న్మాలిమి పెండ నిచ్చి ధర । నీన్ సుకళాలయు జేయుచుంట న
య్యాలను బ్రోవగూడదొకో? । యయ్యది యొప్పదె; వేంక॥

ఉ॥ కుక్కలఁ గుక్కుటంబులను । గ్రోతులనోతువులన్ శుకంబు
లన్

బక్కల నిట్టి గుట్టముల । బట్టె లఁ బందులగాడిదల్ ధనం
బెక్కువ యిచ్చి కైకొని య । హీనతఁ బ్రోచెడివారు పాపముల్
దొక్కెడి నాలఁ జూడరిది । దూష్యముగాదొకో? వేంక॥

* శ్రాద్ధములు *

ఉ॥ ఇద్దరఁ బుత్రులాత్మపితృ । తృప్తి నిమిత్తము వేదశాస్త్ర సం
బద్ధవిధిన్ మృతాహముల । భక్తి నిభక్ష్యమనోజ్ఞ జగ్ధి సం
శుద్ధధరాసుపర్వులక । శోకముగా నిడుచుండ్రు స్వేచ్ఛ దు
ర్బద్ధులు గొందరియ్యదియ । రోచికమందురు వేంకటేశ్వరా॥

ఉ॥ చచ్చిన భ్రాతృ మాతృపితృ। జాలము నేలకొ నెట్లువచ్చునో
వచ్చికుమారు లిచ్చెడిసు। భక్ష్యయుతోదన మెట్లు మెక్కునో
నిచ్చయమెక్కొ?ధీరులిది। నెమ్మదినమ్మరుగాన శ్రాద్ధముల్
గ్రచ్చుఱపీడుఁ డిప్పుడని। కల్మషులందురు వేంకటేశ్వరా॥
ఉ॥ శ్రీరమణా! మృతాహములఁ। జేసెడి శ్రాద్ధము వ్యర్థమైనచో
వారలయాస్తిశస్త్రమని। పల్మఱుఁగోరుట యేటిన్యాయమో?
కోరుటె కాక కోర్టునను। గోట్లకొలంది వ్యయంబొనర్చి యే
నౌరసుడన్ మదీయమని। యందెదరందమె? వేంకటేశ్వరా॥
చం॥ పితరుల యాస్తిశస్త్రమని। బెల్లముకైనడి మెక్కనప్పుడా
పితరుల కాబ్దికంబులను। బెట్టుట న్యాయముగాదుగా: యరే
మతిసెడివో యియిట్టులభి। మానమువీడి వచింతురే: యహో
శ్రుతిహితభక్తియోగతిని। శోభిలుచుండెడు వేంకటేశ్వరా॥
చం॥ పితరులకున్ జనించిరిఁకఁ। పిన్నతనంబున నైకబాధలన్
బితరులఁ బెట్టిరాగతిని। బెట్టిన బాముల కోర్చువారియు
న్నతమతిఁ బెంపునుంగని ర। నంత కళాద్రవిణంబులొంది గు
బ్బెతను వివాహమాడిరహ:। వీడిరితత్తిథి; వేంకటేశ్వరా॥
ఉ॥ పుత్రులుపుట్టి తమ్మునల। పున్నరకంబునఁ ద్రోయకుండ వే
దత్రయబోధితస్థితిని। దత్క్రియలన్ నెరవేర్చి ప్రోతురం
చాత్రముతోడఁ దండ్రులల। యాస్తులనస్థులనిచ్చి యేగుటన్
బుత్రులు శ్రాద్ధముల్ జరిపి। పుణ్యులుగారొకో? వేంక॥

## * విగ్రహారాధనము *

చం॥ నరులు పరాత్పరప్రతిమ । నవ్యతలంబుననుంచి పూజలన్
గరముగఁ జేయుచుండ సరి । గాదనియార్యసమాజధీరులం
దఱనుచు దేవతాప్రతిమ,ఁ । దన్నిజదేశికు విగ్రహంబులన్
జరణముతోడఁ దన్నుటకు । జంకకపోయిరి వేంకటేశ్వరా॥

చం॥ నరులలవిగ్రహార్చనము । నర్పగగూడదటంచు బల్కునే
ర్పరులె స్వవిగ్రహార్చనముఁ । బ్రత్యహముర్ బొనరించుచుండరే
"ఛరిచిలు,, మస్జిదుల్ "దరగ,, । సన్నుతిగేహములందుఁ జేరియే
పరమునుతింపరే: తెలియఁ । బాటుపడన్వలె, వేంక॥

## * కన్యావరవిక్రయములు *

ఉ॥ ఘనధనిరైనమాతృఁదమ । కన్నెనుగాటికిగాళ్లుజూచియుం
డినరొకవృద్ధుకిచ్చుటగ ।డిందిగనింద్యముదవ్యకాంక్షనే
యనదగొ, యంగహీనునకొ, । యన్యకులస్థులనకో, యొసంగుటల్॥
దనుజులసేత కాకతలి। దండ్రులకృత్యమె? వేంకటేశ్వరా॥

ఉ॥ కొందఱుతల్లిదండ్రులిలఁ । గూఁతులఁగొడ్కుల వేలరూ
ప్యముల్ ।
ముందునువెన్కఁజూడకస్వ । భుక్తికినేఁ, వరదక్షిణార్థమేఁ
బొందుచు విక్రయించెదరు । పుణ్యమె? యిద్దిగసాయిసేతయై
కొందలపాటుగూర్పదొకో? । కొండలదేవర! వేంకటేశ్వరా॥

* శిశువివాహములు *

ఉ॥ బాలిశులైనబంధువులో । బాబులొవిత్తము భూషణంబు
లన్ ।
జాలఁగఁబొంది స్తన్యముల । చాలునువీడని బాలబాలికా
పాళికిఁ బెండ్లిసేతురిటు । పాఱని పిల్లలకున్ బొనర్తు గు
య్యాలలభాషికాలలర । నన్నెముగాదొకో? వేంకటేశ్వరా॥

* సక్రమవివాహము *

సీ॥ శ్రీయును విద్యయున్ గులము । శీలమురూపముయౌవనం
బునున్
బ్రాయమునాయువున్ గలుగు । వానికె పుత్రికనిచ్చి పెండి
లిన్
హాయిగఁజేయుతండ్రులకృ । తార్థతఁజెంది సుఖంబుబొం
ది నా
రాయణ ధామ మొందరొకో? । యాశ్రితరక్షక! వేంక॥

* బాల్యవివాహ రజస్వలావివాహములు *

చం॥ పరిణయమంత్రతంత్రములఁ । బట్టి రజస్వలయైనపోడకే
పరిణయమొప్పు, బాలికవి । వాహముగూడదు మ్లేచ్ఛకాల
మం
దిరువురకొ నెఁగదాఁ యదియ । హీనముగాననికొందఱందురి
త్తఱి నది శాస్త్రసమ్మతమె? । తథ్యమె! పథ్యమె: వేంక॥

ఉ॥ బాలకబాలికోపయమ । పద్ధతి మ్లేచ్ఛుల కాలమందునన్
గ్రాలినచోశ్రుతిప్రమనె । కా, దఖిలస్మృతులందుఁ గూడఁద
ద్బాలిక పెండ్లి శ్రేష్ఠమని । పల్కుడిపద్ధతియుండు టేల? యిం
కేల? ననాదినుండియివి । యీవఱకుండుట వేంకటేశ్వరా॥

ఉ॥ చిన్నలకున్ వివాహములఁ । జేసినచోఁగడువారు ముండలై
యెన్నిటొ భ్రూణహత్యలను । నెప్పటికప్పుడు జేసి సంఘమం
దెన్నగరానిహీనుల న । హీనముగాఁ గలిగింతురంచుఁ బె
ద్దన్న సనాతనేతరుఁడె । యాడును దప్పిది వేంకటేశ్వరా॥

ఉ॥ చిన్నతనానఁబెండ్లియగు । స్త్రీలు సువాసినులౌదురంతియేః
యెన్నగరానిహీనులెవి । యించుకగల్గవుభ్రూణహత్యలో
యెన్నటి కాచరింపరుగ! । యేలయిటుల్ పలవించుటయ్య?
యిం
కన్నివిధంబులన్ గులము । హాయిగనుండును వేంక॥

సీ॥ ఫ్యాక్టరీబియ్యంబు, । బహుపదార్థముల్,
పట్టణవాసంబు, బానములును,
ఆహారమందు వి । హారంబునందు ని,
యతిలేమి, సన్మతి । గతియులేమి,
స్పిరిటెడ్డుసర్వ్యాలు, । జెడుగాలిపీల్చుట,
టాౘిము, సైకిలు మో । టర్లు, రైళ్లు,
నింగ్లీషు, సినిమ తో । యెడ్యుకేషనులును,
రైనాల్గునావెల్సు, లంజకతలు,
తే. గీ. స్వేచ్ఛ, టీ? యిట్టివెన్నొ వ । సించి నరుల
దుర్బలులఁ జేయఁ గొందఱే । దోషములను
బాలికావివాహముపై ని । వైతురిద్ది
విబుధనుత్యమొ? । సత్యమే? వేంకటేశ॥
సీ॥ కన్నెఁబెండ్లాడిన । కందుకూర్వీరేశ,
లింగంబుఘనకీర్తి లీలఁబొందెఁ
గన్నెఁబెండ్లాడిన । గంగాధరతిలకు,
లోకమాన్యయశంబురూఢిఁజెందెఁ
గన్నెఁబెండ్లాడిన । ఘనుఁడుమాళవ్యాజి,
యట్టిమహామాన్యయశమునందెఁ
గన్నెఁబెండ్లాడిన । కరముచందరుగాంధి
, యలమహాత్మఖ్యాతి । నందియుండె

తే. గీ. మరియునిట్టివారెందరో। ధరణిఁ గలరు
గాని బాల్యవివాహమ్ము। గారణమునఁ
బిన్నతనమున నీల్గరు। వీరలెల్ల
గింకఁదప్పేమిగలదందు?। వేంకటేశ॥

చం॥ తరుణివివాహముల్ జరిపి। దార్ఢ్యపుసంతతి గాంచనౌనటం
చరిముటిగారిఫార్మ్యగుల। హర్నిశ మందురుగాని కొంద ఱా
పరిణయమాటకున్ మునుపె। భర్తలనెందఱనోరహాస్యమా
కరణినిబొంది బిడ్డలను। గాంచివసింపరె? వేంకటేశ్వరా॥

చం॥ తరుణివివాహతత్పరుఁడు।దక్షుఁడుజై నుఁడునై నగాంధిభూ
సురకులజాత పౌత్రియగు। సుందరికిన్ దనచిన్నిపట్టి క
బ్బురపడఁబెండిలిన్ సలిపి। ముత్తగచందులుగాకమున్నె సం
బరమునఁ బౌత్రుఁ గాంచెనప।వాదమురాదొకో? వేంక॥

* విధవావివాహములు *

ఉ॥ ముండనమాచరించితల। ముంగలముంగురులూఁగుచుండ
నిం
గ్లండున కేగిప్యాసులయి। లాయరులంచొక పేరుబొందిహ్యా
టుండశిరంబునందున న। యోమయభాషలఁబల్కు తేకువన్
ముండలపెండ్లిఁగోరెడి పఠి। బుద్ధులె యెవ్వరు? వేంకటే

ఉ॥ ముండనమాచరించినను। ముంగలముంగురులూగుచుం
డుటన్

ముండలుగారుదారసుత। పుత్రికలుండుకుటుంబముంచుటన్
ముండలుగారు దాడియును ।ఋూనమి సాహెంబులింతగారె
యీా
ముండల పెండ్లిగోరెడి వ్రి । బుద్ధులె యెవ్వరు? వేంక॥

చం॥ పెనిమిటి,రూపవంతుఁడును,।వీరుఁడు,యౌవనవంతుఁ,డ
ద్ధి, స
ద్గుణఖనియైవసించినను।గొందఱుభామలు ఱంకు నేర్పునన్
బొనరుచుచుండనింకనల । బుద్ధియొకింతయు లేనిముండలన్
బనివడిఁదిట్టు టేల?కలి । నైపుణి యియ్యది వేంకటేశ్వరా॥

ఉ॥ ముండకుఁ బెండిలిన్సలిపి । ముత్తయిదన్ బొనరించి
నంత నా
రెండవభర్తడమ్మన ము । రిన్ మగనిన్ ఘటియింతురా?
యిటుల్
వెండియు నెన్నిమాఱులను। బెన్మిటులన్ దగిలింతు! రిద్ది బ
ల్మొండితనంబు, జంతుకృతి । పూర్తిగఁగాదొకో? వేంక॥

చం॥ అటిమటిగా వితంతు శర। ణాలయముల్ నగరంబులన్
"రిఫా
ర్మరు"లిడి చేర్చిముండల న।మాంతము వారిని భార్యలేనిత్రి
మ్మరులకు విక్రయింత్రు పలు । మాటటనవ్వాడి ఘోర
కార్యముల్
వరుస గణింపశక్యమొకో? । వైదికపోషక! వేంకటేశ్వరా॥

ఉ॥ పెండిలి మానుకొన్నయెడఁ । బెన్మిటిచచ్చుటయుండదందు
నగా
ముండగమార దంగనయు । బుద్దికిఁదోఁచిన వారితో సతం
బుండగవచ్చు భోగము ల । హోయనఁబొందఁగ వచ్చుఁ
బ్రీతిలే
కుండిన వీడవచ్చుఁగద! । యెప్పుడె? యిప్డిది వేంకటేశ్వ॥

* స్త్రీ వి ద్య *

చం॥ సతులకు విద్యనేర్పవలె । ఛాందస వైఖరి మాని జాతివాం
డ్రితలి రుఁబోఁడిపోఁడిమిని । రాజిలనాసని కొందఱాం
గ్లమే
యతిశయరీతినేర్పదర । హా! యిదిమంచిదె? వేషభాషలగా
స్థితిగతులెల్ల మార్చి కడు । చేటొనఁగూర్పదె? వేంక॥

చం॥ సుదతికి విద్యగావలయు । చో, నిజజాతివినీతిరీతుల
న్నదలచరిత్రలగా సతుల । నిర్మలగాథలఁ దెల్పునాంధ్రమున్
ద్రిదశులభాష నేర్పవలె । దీన, సతుల్ గులగేహసౌఖ్య
ముల్
బ్రదికిన దాఁకఁబొంది తుది । స్వర్గముజేరరె వేంకటేశ్వ॥

* స్త్రీ స్వా తం త్ర్య ము. *

చం॥ పురుషులకున్నహక్కు పును । బోఁటులకెందుల కుండఁ
గూడదో

తరుణియె గేహలక్ష్మిగద । ధర్మమె? యంచు "రిఫార్మ" రాండిదే
సరియొకొ? యారయన్ బురుష । జాతికి, స్త్రీలకు, సృష్టిభేదమే
వఱలినయప్డు భేదమెటు । వర్తిల దందున? వేంకటేశ్వరా॥
చం॥ పురుషులతో సమానముగ । బూర్ణపుహక్కులు స్త్రీజనాళికిన్
వఱలగనా నటించల రిఫార్మరు లందురు కాని పూరుషుల్
దరుణులమాద్రి గర్భములఁ దాలిచి బిడ్డలఁ గాంచినప్డె త
త్తరుణుల కెల్ల హక్కిడుట । ధర్మముగాన్ గద వేంకటేశ్వ॥
* అస్పృశ్యతా నివారణము. *
చం॥ అలకడజాతివాండ్రె మన । యయ్యలు దాతలు నంతకంటె ము
న్నలరిన వారలెల్లరు । గృహాదివినిర్మితి కర్షకక్రియా
వళినగరావనాదుల న । వారిఁ జేరిచి పోషణంబు బ
ల్పలిపిరి తద్విధిన్ మనము । సల్పుటలేదొకొ? వేంక॥
ఉ॥ ఏ యొక రిర్వు రంత్యజులొ । హిందుమతంబున హక్కుమక్కువల్
పాయుము నాయమన్ మనకు । జక్కఁగఁజిక్కుట లేదటంచహా!

యీయెడ హింసజాతి విడి। యేగెద రేడకొ? కాని తల్లిని
న్యాయములఁ గూరిచుచు విడు। నా మతిమంతుఁడు వేంక॥

ఉ। హిందువులలో నిపంచముల। కేవిధలాభము లేదొ చెప్ప వే?
యిందఱలో నై డాక్టరులు। నాక్టరు ప్లీడరు లీడ రర్థులై
యుండఁ బ్రపంచముల్ చెలఁగి। రే? పరజాతికి వారు పోదురం
చెందనుకఁ భయంపడుచు। నేమియుడక వలె వేంక॥

ఉ। కందముల్ ఇప్పకోరినటు। బావులకుఁ మరి గుళ్ళలోని కే
తెంచుటకొప్పుకొన్నయెడఁ। దిర్గి సహాసన భోజనంబుల
ంచెద రద్దినట్లయిన। దృప్తిని జెందక వెండి వియ్యమా
డించెద రాశకంతము వ। సించునె? యిద్ధర వేంకటేశ్వరా॥

చం। మనజనసంఖ్య దగ్గువని। మాదిగ మాలలఁ గూర్మిఁబ్రొ
చ్చఁజే
సిరి యెవరివారిలో నొకఁడు। శ్రీనిడుమంచను వేత్రా
కందు భా
ర్యాసఁగుమంచనుఁ మత్రొకఁ। డాద్విజు లీల్లిన సౌఖ్య
మబ్బు నం
చను నవుడీపనుల్ సలుపు। టా! విడుటా! హరి వేంక॥

మాలలుమాలదాసరులు। మాదిగలుఁ బయినీడువారలీ
చాలుస నెందఱొకలరు। సర్వులు దాఁకఁగరానివారు వీ

రేల పరస్పరంబుభుజి। యింపరు దాఁకరు గూడనుండ రే?
యాలలిపోకమున్నె యెటు। లందఱు జేరుట? వేంకటేశ్వరా॥

ఉ॥ పంచమజాతివృద్ధికని । వర్షముక్రిందట గాంధిగారు యో
జించి సవర్ణహిందువులఁ । జేరుచు లక్షలకొల్ది విత్తమ
ర్థించి గడించిపెట్టిరిగ । దే యది వారలమేల్మికెట్లువె
చ్చించి తదన్వయంబు సుఖ। జీవిగ జేసిరి? వేంకటేశ్వరా॥

చం॥ అరయగ నందనారనెడి।యంత్యజుఁడెట్లుస్వధర్మదూరుఁడై
యరిగెనె? యన్యజాతి కక ।టా! మునుపాతఁడుతచ్చిదంబరే
శ్వరునకు భక్తుఁడౌటకును। బ్రాహ్మణజాతికిఁబూజ్యుఁడౌట
టకుఁ
నెఱిఁగతమాత్మజాతికృతి।నిష్ఠయెకాదొకో? వేంకటేశ్వరా॥

ఉ॥ పంచమజాతివారలను । బాపలు మున్నుగువారు దవ్వుగా
నుంచుట కంటకుండుటకు।నోర్వమి వైరముగాక వేదశా
స్త్రాంచితరీతిహేతువుగ।దా, యిటె సూతిక, ముట్టుదాని ద
వ్వుంచెదరంట రట్టినిగ।మోక్తవిధిఁ గాని వేంకటేశ్వరా॥

చం॥ ధనకులగౌరవోర్వరలు । దద్దయుఁగల్గిన విప్రజాతియం
దునఁగలకొందఱుఁ గులము । గ్రోసి తురుష్కులయందొ॥
క్రీస్తులం
దునదొబిరాసఁ జేరెదరు, । దూష్యముగాదె!కుబుద్ధిగాక;యీ
పనికెదికారణంబగునొ?। పల్కుమి సూటిగ వేంకటేశ్వరా॥

చం॥ ఎవరెవరేజనిక బనుల । నెట్టివొనర్తురో వానిబట్టియే
భువివలవారి కాయువును । బుట్టువు, భోగము, వర్ణ, వ
ర్ణముఁ
దవులుచు నుండుఁ గాని పెడ । దారులఁగల్గవు స్వీయపూ
ర్వ
ర్మవిధులఁ దృప్తిఁబొందుటయె । మంచిదిగాదొకొ! వేంక

* శా స న స భ *

చం॥ యవనులు, పారసీకులును । హూణులు, హైందవు
లెవ్వరెవ్వరో
వివిధకులస్థ మానవులు । పెల్లుగనున్న యసెంబ్లియందు పి
న్నధ్వుల మతస్థధర్మముల నుక దెగటార్చు కుశాసనంబులక
దవిలి యొనర్తు రియ్యది య । ధర్మముగాదొకొ? వేంక

* కాం గ్రె సు అ స హా య వా దు లు *

ఉ॥ హిందువులుక, దురుష్కులును, । నింగ్లిషువారలు, ప
రసీకు లిఁ
కెందఱొ క్రిస్టియన్లు, వసి । యించినకాంగ్రెసు, ప్రస్తుత
బునక
హిందుమతస్థ ధర్మమును । హింసనొనర్చెడితీర్పులెన్నియో
తొందరతోడఁ జేతు రిది । దూష్యముగాదొకొ? వేంక

ఉ॥ ఖాది, స్వదేశవస్తువు ల । ఖండితరీతి గొనంగనొను. పూ
ర్ణాది, స్వరాజ్యసిద్ధికిది । యంచు మహాసభలందు మాటికిన్
వాదనజేయు బోధకులె । వర్తకులే, పరనైకయంత్ర వ
స్త్రాళులఁగొంచునుందురుగ । దా యిదిపాడియె? వేంక॥

చం॥ మనయసహాయవాది "సిని । మా"లఁగడున్ వెలకొల్పి
కోట్ల కొ
ల్దినిధనమున్ గడించెడి గ । దే! యిది, విశ్వవదాన్యకృ
త్య మ
య్యెనొకొ? యసెంబ్లి, కౌన్సిలును । నిష్ఠెటు పూజితమై
ప్రవేశ్య మ
య్యెనొ?యసహాయవాది? కిది । హేయముగాదొకొ? వేంక॥

చం॥ మనయసహాయవాదులొ యఁ । మాంతముగాను స్వరా
జ్య మొక్క హ
యనమునఁదెత్తు మర్థబల, । మంగబలంబును, సత్యపుంగ్ర
హం
బు, నవసరఁబటంచుఁ బరి । పూర్ణముగావచియుంచికోట్లకొ
ల్దినిధనమున్, బ్రిజన్, గొనియు । దేబెలెవైరిగ! వేంక॥

చ॥ మనయసహాయవాదులెయ । మాంతపురాజ్యము దేకపోగనిం
టనుగలపెండ్లిపెత్తనము । దమ్మనిపించెడి "సారడాక్ట్," సెం

ల్లిని వడిఁ "బ్యాసు" జేయనొనరించి శ్రుతిస్మృతియోగ్య
ధర్మనా
శనమును సల్పసాగి రిది। సజ్జనకృత్యమె? వేంకటేశ్వరా॥

చం॥ మనయుసహాయవాడులె స। మంజనఫక్కిని బాల్యమం
దుఁ బెం
డ్లిని సల "సారడాక్టు"ను గ। డించిగ దాటి యొనర్చు
యాజకు
న్నినిమిటిఁ దలిదండ్రులను। నేరమువోపుచు ఖైదుజుల్మ
నాల్
ఘనముగఁ బొందఁజేతురిది। కర్బురకృత్యము. వేంక॥

ఉ॥ రాముఁడు, సీత బాల్యమున। రమ్యవిధంబునఁ బెండ్లియా
డుటన్
రాముని తల్లిదండ్రులను, । రాముని,జానకి తల్లిదం
డ్రులన్
స్థేమహితుల్ వసిష్ఠముని। నిన్ "జరిమాన" విధించి
"జైలు"నం
దీ మతిమంతులుంచరొకొ? । యిప్పుడెయుండిన; వేంక॥

చం॥ మనకు స్వతంత్రరాజ్యము న । మాంతముగానిడు కాంగ్రె
సీ "లసెం
బ్లి" ని శ్రుతిశాస్త్రనింద్యకృతి । విస్తృతిగూర్చెడి "బిల్లు"
లెన్నియో
పనివడిఁబెట్టు చుండి రిది । పాజ్ఞులకృత్యమొ! యాత్మరా
జ్యమా
ర్జనమొనరించుటేమొ? మరి । రాక్షసకార్యమొ? వేంక॥

సీ॥ వేదశాస్త్రోదిత ♦ వివిధ ధర్మంబులఁ
ధ్వంసంబుజేయుచుఁ ♦ బ్రబలువారు
దనకిష్టముగలేని ♦ పనిమంచిదైనను,
దప్పని చెప్పెడి ♦ గొప్పవారు
ముట్టుపెండ్లిండ్లకు ♦ ముండలపెండ్లికి,
ముత్తైద పెండ్లికి ♦ మురియువారు
సకలాచారావృత ♦ స్త్రవ్యగోమాత నే,
సెపముతోఁజంపెయు ♦ నిక్కువారు

తే॥ మఱియుఁ బాశ్చాత్యపద్ధతి ♦ మరఁగు వార
లును మహాత్ములుఁ లీడర్లు ♦ ఘనులు విశ్వ
జాతలునునైరి సెప్పఁగాఁ ♦ దరమె! నేఁడు
వినవె! కనవె! యీవింతలఁ ♦ వేంకటేశ॥

### * ప్రస్తుతపారిభాషికపదములు *

సీ॥ దేవభూదేవ వి ♦ ద్వేషంబుఁ జూపుటే,
పరిపూర్ణనిజదేశ భక్తి యయ్యె
దివ్యశ్రుతిస్మృతి ♦ ధిక్కృతి సేయుటే,
యెంతయు దేశసే ♦ తృత్వమయ్యె
నవిచారరీతిగా ♦ నన్నపానాదుల,
దద్దఁ గ్రోలుటయె యా ♦ దార్ఢ్యమయ్యె
నెన్నియుక్తులనైన ♦ నితరులవంచించి,
వెలయుటయే గొప్ప ♦ విద్దెయయ్యె

తే॥గీ॥ నెల్ల దేవాలయంబుల ♦ నెల్ల జాతి
జనులదూర్చుటయె సమద ♦ ర్శనమునయ్యెఁ
దన్నుఁ దాఁ దొంగిలించుట ♦ ధర్మమయ్యె
వినవె! యింకేను జెప్పెద! ♦ వేంకటేశ॥

సీ॥ అనుకూలనీయ పా ♦ పానువృత్తియె యిష్ట,
కమనీయవిధ్యుక్త ♦ కర్మమయ్యె
విమలసదాచార ♦ విశ్రాణనమె యిష్ట,
ప్రఖ్యాతమైన వీ ♦ రత్వమయ్యె
బరని కేతనమనో ♦ భార్యాతనూభవ,
ధనపతిత్వమె యిష్ట ♦ త్యాగమయ్యె

ఈతిబాధలచేతఁ ♦ గృశియించు స్వజనులఁ,
గంటఁగాంచమి యిప్డు ♦ కరుణయయ్యె

తే॥గీ॥ తల్లిదండ్రులు మొదలైన ♦ యెల్లబుధుల
నవలవిడుట గృతజ్ఞత ♦ యయ్యెనిప్డు
డహహ! యేమనివచియింతు? నఘువినాశ!
వేగవిజ్ఞులఁ బ్రోవవే! ♦ వేంకటేశ॥

* సంస్కృతాంధ్ర భారతములు *

ఉ॥ అన్న!మహాత్మ యల్పమతి । నైనవిమర్శకుడిప్డు తెల్వియే
మున్నదొకాని భారతమె । యుత్తది, కల్పిత, మప్రమాణమం
చెన్నుచు ద్రౌపదీసతిని । నీలువులేని దటంచుఁబల్కునా
దున్నను నేమి యన్నదది । దోసము గూర్చునె వేంక

సీ॥ వర్ణాశ్రమాది ప్ర ♦ భావాసహిష్ణులౌ,
పెద్దలుదానిశా ♦ పించినట్లు
పరవేషభాషల ♦ మరగుసుందరులు స్వా,
ధ్వీలలామలఁబట్టి ♦ తిట్టినట్లు
శిశ్నోదరాయత్త ♦ చిత్తులుపరమార్థ,
మెంచుభక్తులను దూ ♦ షించినట్లు
గ్రాంధికమహిమంబు ♦ గననిప్రబుద్ధులు,
మించియద్దాని నిం ♦ దించినట్లు

తే॥గీ॥ అమర భాషాపరిభావంబు ♦ నరయలేని
యాంగ్లమానస పుత్రులై ♦ నట్టివార
లిపుడు సంస్కృతభారత ♦ కృతినిఁ గుకృతి
యంచుఁదిట్టి రీపాపంబు ♦ వ్యర్థమగునె?

సీ॥ ఆంధ్రాదికవివరు ♦ నష్టభాషావిదు,
ననసీవిబుధుని న న్నయ్యబుధుని
నాంధ్రకవిబ్రహ్మ ♦ నాధ్యాంధ్రకవిమిత్రు,
వ్యవహారదక్షుఁ డి ♦ క్కనమనీషి
సరసకవిఁ బ్రబంధ ♦ పరమేశుఁ బరమేశ,
దాసు నెఱ్ఱన్న ప్రి ♦ ధానమంత్రి
దత్కవిత్రియురచి ♦ తముశ్రితిసమమునౌ,
పరమపవిత్రాంధ్ర ♦ భారతమును

తే॥గీ॥ మఱిఁ దదనుయాయులగు నాంధ్ర ♦ సరసకవులఁ
జేర్చి మనసార నోరారఁ ♦ జేతులార
నెంచి దూషించి విలిఖించి ♦ యేమొఘనుల
మంచు మురిసెదరో వేంక ♦ టాచలేశ!

* హిందీభాషా ప్రచారము *

ఉ॥ కొందఱు దేశ నేతలను । కూలము గొప్పది వృద్ధిమూలమౌ
హిందిని నేర్వఁగావలయు । నెల్లరటంచు వచింత్రుగాని వీ

రెండుజనించి యెందు నభివృద్ధిని।బొంది సుఖించుచున్నమా
టం దలపోయ క్లిష్టులను । టల్ శుభదంబొకో? వేంక॥

ఉ॥ కొండఱు మాతృభాష విడి । గొప్పది హింది యటంచు మాతయం
చందురుహింది నేర్వవలె । నందరు నందురు కాని తల్లినిన్
సుందరి గాదటంచువిడి । పోకుగనుండు పరన్ స్వమాతగా
డెందమునందలంచు ఖలు । తేవగదా యిది వేంకటేశ్వరా॥

ఉ॥ ఏ జనులేస్థలాన జని । యింతురొ యచ్చటివారి కందువి
భ్రాజిలు భాషలోని కృతి । రాజియె సంస్కృతవాణిలాగునన్
దేజము నాయురర్థములు । ధీరత సిద్ధిని ధర్మమోక్షముల్
రాజిలఁజేయునంచు బుధ । రాజులువల్కరె! వేంకటేశ్వ॥

* —— నానా విషయములు —— *

చం॥ నలువమొగంబులన్ వెడలి । నైతికవైదిక లౌకికార్థికో
జ్జ్వలతరయోగికార్థ బహు। సంగతిభంగి నభంగురస్థితిన్
దెలుపఁగఁజాలి మేలులిడ । దివ్యమహామణి వైవెలుంగు ప్రాఁ
బలుకు నుతింపనోపుదునె ?। పంకజలోచన వేంకటేశ్వరా॥

చం॥ వరధన రూపవంతుఁడగు । పాండితిలేని కుపుత్రుకంటెఁ బ
ల్వారమగు గర్భపాతమును । భామిని వంధ్యగనుంటయో కడున్

వరము జనించునప్పుడు శ । వంబుగఁబుట్టుచు నుండుశే
లలిఁ
వరము సుపుత్రియేకలిగి । వర్ధిలుచుండుట వేంకటేశ్వరా॥

ఉ॥ స్నానము సంధ్యయుఁ జపము । "నాన్నను" సయ్యెఁబర
ప్రవృత్తియే
మానితమయ్యెఁ బూతనిగ । సుప్రథితోరుకృతుల్ నశించెన
న్యానవదర్శనాభిరతి । నాయికలే సతులైరి సాధ్వి సం
తానము సెడ్డదయ్యెఁ గలి । దౌష్ట్యమిదేగద వేంక॥

చం॥ కులపతనంబు, నిందయును, । గోవిదసద్గురు బంధుమానినీ
లలిత హితోపదేశము, ని । లాపరిపాలరక ఘోరదండనం
బలఘుధనవ్యయంబు, నధ । మాధమసంగమభంగి,, పాపభీ
తులఁగులటల్ గణింప రిది । దోఁచకయున్నది వేంక॥

ఉ॥ పెండిలినాఁటి సంబరము । బెబ్బులిఁజూచిననాఁటి భీతి
యుఁ
జెండిననాఁటి శౌర్యమును । శ్రీహరిఁగాంచిననాఁటి భక్తి
యుఁ
ముండగ మారునాఁటివెత । పూరుషుఁగూడిన నాఁటి లజ్జ
యుఁ
గండపునాఁటి యేడ్పుపుడుఁ । గాలును పూర్తిగ? వేంక॥

చం॥ వినయము లేని విద్యయును । వీర్యము లేనటువంటి శౌర్య
మున్
ఘనతయు లేని జీవితము । గానుగ డింపగ లేని బేరమున్
ఘనములు లేని యాకసము । కాంతుఁడు లేని లతాంగి
నిక్కమున్
గనుగొన లేని మానవుఁడు । గౌరవ మొందు నె? వేంక॥

ఉ॥ కారము లేని పచ్చడియు । జ్ఞానము లేనటువంటి మౌని, సం
సారము లేని మానిసియు । సంతతి లేని గృహంబు, వేదవి
ద్యారతి లేని బ్రాహ్మణుఁడు । ధర్మమెఱుంగని సేవకుండు శ్రీ
సూర్యుఁడు లేని వాసరము । సొంపును నింపు నె? వేంక॥

చం సరసత లేని వాదులును । సత్యము లేని మహాపవిత్రయున్
వరుసయి భక్తి లేనిసతి। భార్యపయిన్ దయి లేనిభర్తయున్
అరుల జయింప లేని మను । జాధిపులున్ మధురంపుగా
త్రమున్
వలులని గాయకోత్తములు । వ్యర్థులుగారొకో? వేంక॥

ఉ॥ రాగము లేని భోగియును । రాగము వీడిన పాటకాఁడు ను
ద్యోగము లేనిమానవుఁడు, యోగము లేనటువంటి జోగి స
ద్యోగము లేని వర్తకుఁడు । యోగ్యత లేనని కళాప్రవీ
ణుఁడే
భాగ్యగతి లేని భోక్తయథ । మాధముఁడేకద! వేంకటేశ్వరా॥

చం॥ పరపురుషాభిలాష కుల । భామలకెచ్చోఁ బరాంగనార్థ సం
హరణము పూరుషావళికి । నత్యధికంబుగఁగల్గె స్వేచ్ఛయే
సరియనితో చెఱుత్యుదిత।సర్వకృతుల్ సెడువర్మ్య వర్ణసం
కరమె మహోపకారముగఁ । గ్రాలఁదొడంగెను వేంక॥

ఉ॥ బాపల నల్ల పోరలను । బంచములందున నెట్టివారి నా
లాపముఁ జేయుపూరుషుల । లాస్యమొనర్చు విలాసినీతతిః
జ్ఞాపకమేమి లేని నరు । శౌచము లేనటువంటి యొజ్జ నే
రేపరి నమ్మఁగూడదుగ । యేమివిచిత్రము వేంకటేశ్వరా॥

ఉ॥ కొందఱు గోపిచందనము । గొందఱు భస్మపురేఖలః
మరిః
గొందఱు లింగధారణము । గొందఱుశంఖ ముఖాదిచిహ్న
ముల్
గొందఱు గర్భచిహ్నములఁ, గుంకుమచిహ్నిత భీకరాంక
ముల్
గొందఱు దాల్చుచుందు రిది । గోడిగమానొకో? వేంక॥

ఉ॥ ఆయతకుంకుమాంకముల । నాస్యమునందిడి, దాడి, మీస
లః
రోయక సెంచి భూతములఁ । ద్రోలుటలో మొనగాండ్ర
మేముశా

క్షేత్రయులమంచుఁ గొందఱటుఁ । దిర్గుచుఁ బల్కుచు మద్య
మాంసముల్
హాయిగఁబుచ్చికొందు రహ । హా! యిదిధర్మమె వేంక॥

ఉ॥ కొందఱు భోక్త లాతిథి క । కుంఠితపద్ధతిగా నిమంత్రణం
బొంది ప్రభాతకాలమున। "నుష్మ,,ను "గాఫి,, నినాని తిర్గి మ
ధ్యందినవేళఁ జేర యల । తద్దినమందు భుజింతు రిట్టులే
కొందఱు కర్తలానెదరు । కూళతనం బిది వేంకటేశ్వరా॥

ఉ॥ బాపలు పాపులెంతొ "బడ । వా,, లనుచుల్ గసిదీర
దూఱువా
రే పృథివీసురత్వముఁబొ । రింబొరిఁగోరి యనేకయత్నముల్
"సాపు,, గ "ట్రౌకు,, గా సలిపి । జందెములల్ దగిలింత్రు
చూడఁగా
నీపని మోసగాండ్రదిగ । దే! శుభదంబొకొ? వేంకటే॥

వం॥ జ్వరము "డిసెంటరీ,, "టయిఫాయిడు।ఘానును,, చెట్టి" డబుల్నె
మోనియా,,
"సరిది,, "మలేరియా,, కలర । జన్నియు ప్లేగును నింప్లు
యంజ మొ
కరలునిఁ కెన్నొరోగములు । గ్రాలి యకాలమునల్ మను
ష్యులల్
బొరిఁబొరిఁ జంపుచుండె నివి । పోకడఁ బెట్టవె? వేంక॥

చం॥ తారకలు హిందువుల్ ధరను । దోర్బలగర్వముతోన్ స్వ
జాతినీ
తిరహితతుచ్ఛబుద్ధులయి । దేవగృహంబుల దగ్గ మస్జిదుల్
బోరిఁబోరిఁ బాడుసేసికొని । పోరుచునుండిరి వీరలన్
సహో
దరులని నేత లందురు గ । దా! యిదిధర్మమె? వేంక॥

ఉ॥ ఏలిక, హోటలుల్'' గులట । యింగ్లీషు,విద్దియ, లేమి,
''యాస్పిటల్''
రైలు, గౌళాయి, నౌకరియు । బ్రహ్మసమాజము, నార్య
సంఘముల్,
స్త్రీలస్వతంత్రి మగ్రజకు । చేష్ట, రిఫార్మరుబోధ, ధర్మ
ముల్
గూలిచి వర్ణసంకరము । గొల్పుచునుండెఁగ వేంకటేశ్వ॥

చం॥ మునుపటికాంగ్రెసాశయమ ।మూహము గమ్యపదంబుగా
విధిం
చినదు చు నాయకోత్తములఁ । జేరినుతింపగనౌను ధర్మనా
శనరతులై యథేష్టముగ । సంచరణంబొనరించువారలన్
వినుతిని జేయఁగాఁదగునె? । విజ్ఞమనోహర! వేంకటేశ్వరా

చం॥ జనులకు సర్వధర్మవిధి । సాధుతయున్నను జేయుకుంఘుతే

ఘనతనిదుర్గ స్వధర్మవిధిఁ । గష్టములున్నను జేయుచుండు టే
ఘనతనిదుర్గ స్వధర్మమ్మృతి । గౌతుకదంబగు నన్యధర్మమో
ఘనభయపాపదంబగును । గాదె! గుణాకర! వేంకటేశ్వరా॥

ఉ॥ ఎవ్వఁడుదాఁటి శాస్త్రవిధి।నిచ్ఛకు నచ్చినటుల్ చరించునో
యవ్విశుఁడెట్టిసిద్ధి లవ । మంతయుబొందఁడు సౌఖ్యముం
గనం
డవ్విబుధస్తవార్హమయి । నట్టి పరంపద మొందఁడందుచే
నవ్విధియే ప్రమాణము గ । దా! యఖిలంబున వేంక॥

ఉ॥ మనమునకంటె వేఱొకటి । మాయజనింపదు లేదు లేద దే
ఘనభవబంధ హేతువయి । కాలునుగాని మఱొండుగా
దు త
న్మనము నశింప నన్నియు వి।నాశముఁజెందును వృద్ధియైనచో
ఘనమగు సర్వమంతకిదె । గారణమయ్యెడి వేంకటేశ్వరా॥

చం॥ మెలకువయందునన్ గలను । మేమని మీరని యిద్ది
బుద్ది త
ద్విలసిత వృత్తి యియ్యది ని । వేక మిదే యవివేకమి
య్యదే
కల దిది లేదటంచు బహు ।కల్పనలంబొనరించి యెల్లచో
ట్లలరున దెద్దియో యదియె । యాపర తేజము వేంక॥

ఉ॥ సత్యమనంతముం బరము । జ్ఞానము శుద్ధము నైజసిద్ధ

మున్

నిత్య మనన్య మవ్యయము । నిర్గుణమున్ బ్రిమదస్వరూప
మున్

బ్రత్యవహార భాసురము । బ్రిహ్మము సర్వ చరాచరంబు
లన్

బ్రత్యయపాత్రిమై మిగుల । భాసిలుచుండెఁగ వేంక॥

ఉ॥ ఎందుల కాగ మనాధ్యయన । మేల? శ్రుతిస్మృతికర్మ సం
చయం

బెందులకర్థవృద్ధి మరి । యేలొకొ శాస్త్రపురాణకౌశలం
బెందుల కుత్తమోపకృతు । లెందుల కస్త్రకళా దృఢత్వ
మా

నందముగాంచ లేనితఱి? । నవ్యగుణార్ణవ! వేంకటేశ్వరా॥

* — ధార్మిక ప్రబోధము. — *

మ॥ అర రే! కొందఱు హూణవాగ్విదులు యుక్తాయుక్తముల్
వీడి ధ

ర్మరహస్యార్థమెఱుంగలేక యల సా । మాజ్యోరు శిక్షా
స గ

స్వరజాతీయులతోడఁ గూడికొని య । న్యాయాజ్ఞలన్ జే
యఁబూ

నిరి యోధార్మికులార!పట్టుదలతో।నిగ్రింపుఁడీన్యాయమున్ ॥

మ॥ లెండో; ధార్మికులార! మీరలికనీ। లీలన్ మహానిద్రలో
నుండన్ జెల్లదు వేగ మేలుకొనుఁడీ। యాచారసంస్కర్త లే
యుండన్ సాగిరి గన్నులన్ దెరువుఁడీ। యాక్షేపింపుఁడీ:
చూడుఁడీ:
దండిన్ జూపి యధర్మమున్ జదుపుఁడీ!। ధర్మంబు నెక్కొ
ల్పుఁడీ॥

సీ॥ వేదశాస్త్రోదిత ♦ విమలధర్మంబులు
కలహప్రదములని ♦ పలుకఁబడియె
వర్ణాశ్రమాచార ♦ భాసుర కర్మముల్,
క్రూరకర్మములని ♦ కూయఁబడియె
వేదశాస్త్రోద్ధుర♦విద్వత్సమూహంబు,
నప్రయోజకమంచు ♦ ననఁగఁబడియె
సభకెక్కఁజాలని ♦ సాధ్వీలలామలు,
వంటలక్కలటంచు ♦ వాగఁబడిరి
తే॥ కులపుకట్టుబాట్లకు లొంగి ♦ చెలఁగుబుధులు,
పనికిమాలినవారని ♦ పలుకఁబడిరి
ధర్మశాస్త్రవిరోధులై ♦ ధరనుదిరుగు,
సంఘసంస్కారనామక ♦ జనులచేత॥

సీ॥ ఐహికాముష్మికా ♦ హ్లాదంబునిడఁజాలు,
ధర్మంబు దివ్యర ♦ థంబుగాగ

వేదశాస్త్రోద్దండ ♦ విద్వాంసులెల్లరు,
రమణీయములగు న ♦ శ్వములుగాఁగ
యమనియమాసనా ♦ ద్యష్టాంగసంగత,
ధర్మగురువులు చో ♦ దకులుగాఁగ
బ్రాహ్మణక్షత్రియ ♦ వైశ్యజఘన్యజుల్,
శిష్టవరేణ్యులు ♦ సేనగాఁగ
వర్ణాశ్రమాచార ♦ పాలనతత్పర,
పార్థివుల్ వాహినీ♦ పతులుగాఁగ
వేదశాస్త్రపురాణ । విహితార్థబోధక,
నవ్యవాణులురుబా ♦ ణములుగాఁగ

తే॥ ధర్మతత్త్వముదెల్పు వే ♦ దపురుషుండు
జయజయధ్వనులొప్పంగ ♦ సకలదిశల
గలయధర్మంబు ఖండింపఁ ♦ గాశినుండి
తరలుచున్నాఁడు మ్రొక్కుఁడో ♦ సరసులార!॥

మ॥ రండో ధార్మికులార! కాశి నల ద । ర్భాంగా మహారాజు, యో
గ్యుండౌ కాశినరాధిపుండుజయపూ । ర్వోశుఁడుఁ మైథిలే
శుండుఁ గాఢవిభుండు లోనుగల రా । జుల్ ధర్మయుద్ధంబునుఁ
జండప్రక్రియఁ జేయ నెంచిరి సుమా । సాయంబుగావింపుఁడీ॥

చం॥ నలువురు భ్రాతలుండిరి ధ । నానికి ధర్మ, కృశాను, భూప, చో
రు లనఁగ; వారిలోఁ బ్రథము । రోసినఁదక్కిన మువ్వురుక్ గ్రుధా
జ్వలితమనంబులక్ లయము । సల్పుదు రక్కతనక్ ధనాధ్యు ల
చ్చలమున ధర్మరక్షణము । సల్పుట మంచిది వేంకటేశ్వరా॥

మ॥ అరరే! చాగురే! దోషదూషితమహా । హంకార హుంకార సం
కర సంస్కారివరేణ్యు లిమ్మెయిని ని । ష్కాపట్య వేదోక్త ధ
ర్మరహస్యార్థధనంబు నెట్లొ కని బ । ల్మాయోక్తులక్ దొంగిలక్
సరదారుల్ గఁజెలంగిరట్లు గను మీ । శా! వేంకటాద్రీశ్వరా॥

* ధర్మసేవక పత్రికాప్రశంస *

సీ॥ సకల వర్ణాశ్రమ ♦ స్వారాజ్యసంఘము,
న్భారతధర్మ స ♦ న్మండలంబు
హిందుసెంట్రల్ కమిటి ♦ హిందిహిందూపత్రి,
మిండియన్ మిత్రరు, ♦ హిందుమైరండు
పాంచజన్యాభిన ♦ వసరస్వతియు దేవ,

నల్పి విషామృతంబుల వె। నర్ దగుతీత్రిని వారికిచ్చి యా
వేల్పులఁబోవ్రలేదె? కన । వే! యటు నన్నును వేంక॥

వరాహావతారము.

ఉ॥ ఈక్షితి నెల్లజుట్టుకొని । యేగెడి రాక్షస నాథుఁడౌ హిర
ణ్యాక్షువరాహరూపమున । నంతమొనర్చుచు సర్వసస్య స
ల్లక్షణ లక్షితావని వి । లాసవిధంబున నీదుకోరలన్
దక్షతఁదాల్చి నిల్పవాకొ?। తన్పవె లేఖిల? వేంకటేశ్వరా॥

నరసింహావతారము.

ఉ॥ శ్రీదయితున్ బహువ్యథలఁ। జెందుచునున్నఁ దలంచు ప్ర
హ్లాదుని వేఁడికోలు విని । యా పెనుకంబమునన్ జనించి మాం
సాదవిభున్ వధించియు ర । యంబున నీప్రియభక్తుఁ బ్రోవఁగా
లేదె? బలే యనన్ నరహ । రీ! కరుణాకర! వేంకటేశ్వ

వామనావతారము

ఉ॥ పుట్టి మహేంద్రు భ్రాతవయి । పొట్టిఁడువర్ణివిమై బలిభ్రున్
ముట్టి నుపాదంబు గొల్పి యొక। మూఁడడుగుల్లల భూమి నడ్గి నె
పట్టి పదద్వయంబున ది । వం బవనిన్ గొని వేర్పదంబునన్
మెట్టి తలంబునన్ బలిని । మేలుగఁగూర్చవె! వేంకటేశ్వ

## పరశురామావతారము.

చం॥ తనయుఁడ! రామ! నీవయినఁ। దల్లిని రేణుకఁ జంపుమన్న వే
జననిని జంపి నీమపిత । సంతస మంద వరంబు గోరి త
ల్లిని బ్రతికించుకొంటి వవ । లీలగ నీతలిదండ్రులందు నీ
కొనరినభక్తి యింతయన । నుక్తికివచ్చునె? వేంకటేశ్వరా॥

చం॥ ఒక దెస దుష్టభూపతుల। యుక్కడగించియు క్షత్రధర్మము
ల్ప్రకటనఁ జేసియుంటి వొక । ప్రక్కధరామగ ధర్మకర్మముల్
సకల మొనర్చి బ్రాహ్మ్యమును । సార్థకముఁ బొనరించియుంటివో
ప్రకటితవీర్య యో పరశు । రామ! దయాకర! వేంక॥

## శ్రీరామావతారము.

చం॥ కొడుకులు లేనిగీము హరిఁ। గూర్చినుతింపని నోరు దమ్మిగ
న్పడని తటాకముఁ బుధులు।పర్వనిగోష్ఠియు రిత్త లేయటం
చడలుచునుండు నాదశర।థాధిపు గేహమునందు నల్వురా
కొడుకులుగా జనించి యుల । కుం బరిమార్చవె? వేంక॥

ఉ॥ బాటను నొంమబండను భ । వత్పదకంజరజంబు సోకఁగా
దేఁటులఁదాఁటు నెక్కుడులు । దేసియలొక్కడి మోవి
చంపుకుఁ

మీఱెడిమోము బంగరును । మించునొడల్ గల మేటి
బోఁటి య
ప్పాట జనించె నీమహిమఁ । బల్కఁగ నేర్తునె? వేంకటే॥
చం॥ జనకుఁడు దక్కవారలును । సంశయమందఁగ గాధి
జాది స
న్మునులు జయంబుగోరఁ జెలి । భూపతు లిద్ది యసాధ్య
కృత్య మం
చును నిరసింప నందఱును । జూచుచు నుండఁగ రౌద్ర
ముద్రికా
కనదురుచాపముఁ విఱిచి । కౌతుకమొందవె వేంక॥
ఉ॥ శ్రీతత భూషణాంబరవి । శేషవిభూషిత సర్వసద్గుణో
పేతను లోకమాతను వి । వేకలసత్సతివంద్యభూతనూ
జాతను బూతసీత నల । శంకరశస్త్రవిదారణార్థమై
యాతఱినిం బహూకృతిగ । నందవె? శ్రీకర! వేంక।
చం॥ అనుజుల నమ్మలఁ సఖుల । నంతపరిభుత్వము నట్టితండ్రి నా
జనపదులఁ మునీంద్రతతి । సౌఖ్యకరోక్తుల నామహో
త్సవం
బును విడి దండకాటవికిఁ । బోయి చరించుచునుంటివే
యహో
జనకుని యాజ్ఞ నిల్పనగ । చాల్లెఁబు లోంగితో? వేంక

ఉ॥ కావర మొంది రాజ్యమును । గాంతహరించిన మేటివాలినిన్
నీవిశిఖన్ వధించి కపి । నిస్తులవందితరాజ్యపీఠి సు
గ్రీవుని బట్టభద్రునిగ । గేరుచు సల్పి ముదంబు గూర్పవే!
దేవ! యనాథనాథ! కుల । దీపక! రాఘవ! వేంకటేశ్వరా॥

ఉ॥ దేవతలొంద సంతసము । దీవెనలం బొనరింపమానులున్
భావుక మొందుచుండ గ్రహ । పంక్తి; మహాశుగ ధార లోకవి
ద్రావణు రావణున్ సచతు।రంగముగా నశియింపఁ జేసి రా
జ్యావృతుగా విభీషణుని । స్వాశ్రితు సల్పవె వేంకటేశ్వరా॥

ఉ॥ సీతను వీతిహోత్రనుత । జీవితఁగూడి విమానమెక్కి ని
ర్భీతి స్వదేశయాన మొన । రించి మొదల్ గుహుఁజూచి పిమ్మటన్
భ్రాతను గంటివే! యరయ । బంధుతకంటెను బత్తిముఖ్యమం
చీతతి నేనెఱింగితి నిఁ । కేను జయించితి వేంకటేశ్వరా॥

చం॥ జయజయ రామ!యంచు ముని । సంతతి దీవెన జేయుచుండ ని
ర్భయముగఁ బౌరులున్ గనుల । పండువగాఁ గనుచుండ దేవతల్
రయముగఁ బుష్పవర్షము స।రాసరిగాఁ గురియంగ బాలనా
నియమిత సింహపీఠిదగ । ణి పరిధ వెల్గవె? వేంకటేశ్వరా॥

ఉ॥ శ్రీమహిజాభిరామ! యత । సీసుసుదామ! బృహద్వ శోలస
ద్భామ! సురూపకామ! రఘు ॥ పోషితవంశఘఝాబ్ధి సోమ! యు
ద్ధామనిశాటభీమ! శ్రుతి । ధర్మమహోదయరమ్యసీమ! శ్రీ
రామ! యఘుంబులన్ దునుము । రా! ననుగావవె! వేంక

* బలరామ కృష్ణావతారము *

చం॥ ధృతిగల యోగమాయ, యల। దేవకి సప్తమగర్భమున్ గ్రహిం
చి తమిని రోహిణీసతినిఁ । జేర్ప బలుం డనఁబుట్టవే. యఁ
ర్త్యతతులు పుష్పవృష్టిని స। రాళముగాఁగురియంగ దే
సతివసుదేవయాదవులు । సంబర మందఁగ వేంకటేశ్వ
ఉ॥ నీవు జనించి రేవతిని । నెయ్యము తో విధిఁబెండ్లియాడవే
దేవతలన్ మునీంద్రుల న । తిప్రమదంబునఁ బ్రోవలేదె! నా
నావిధతీర్థయాత్రలను । నవ్యవిధంబునఁ జేయలేదె! యో
దేవర! రోహిణేయ! వసు । దేవ తనూభవ: వేంకటేశ్వ
చం॥ హలి! బలి! నీలచేలధర! । యంబుజలోచన! పాపమో చనా.
సులలిత గాత్ర! బిల్వలని । షూదన! భీమసుయోధనాది మాం

సలగురువర్య! యార్యముని । సంస్తుతపాదసరోజ! తాలస

మ్మిళితసుకేతనా? ముసలి! । మేలిడి ప్రోవవె! వేంకటేశ్వరా॥

ఉ॥ అంతటి దైత్యబాధలకు । నాగఁగఁజాలక వేల్పులెల్లరున్

జింతను నీసమీపమును । జేరి హరీ! మముఁరక్షసేయఁ బ్రా

ర్థింతు మనంగ నీవలరి । దేవకి యష్టమగర్భమందు జ

న్మాంతర మొంది కాచెద న । టంచు వచింపవె? వేంక॥

ఉ॥ దేవ! మహానుభావ! వసు । దేవు తపంబును మెచ్చి దేవకీ

దేవికి ముద్దుబిడ్డవయి । దిక్కులఁదేజము పిక్కటిల్ల న

క్కావరు లక్కిలింబడఁగఁ । గౌతుకమొందఁగ నాదితే

యులున్

నీవుజనింపవే! గుణిమ । ణీ! కమలావర! వేంకటేశ్వరా॥

చం॥ సురుచిరడోలికాంతరను । శోభితు, నిన్, బరిమార్పఁ

బూతనా

సురి, గరళాన్వితంబును స।శుద్ధమునౌ చనుఁబాలొసంగ నీ

వతిమిటి రక్తయుక్తముగ । నానుచు దానిని రూపుమాపి

యం

దఱకును వింతఁగూర్పవె! గ । దాధర! శ్రీధర! వేంక॥

చం॥ అలశకటాసురున్ దునుమ । వా! యఘదానవు రూపు

మాపవా!

బలుని బకాఖ్యు, ధేనుకుని, । వత్సముఖాసురులన్,

వధించి యిూ

యిలఁగల భారమెల్ల నశి । యింపఁగఁ జేయవె? నిను బాల్యమం
దలిబల మే బలిష్ఠునకు । దక్కెనో? పల్కుమి! వేంక॥

ఉ॥ శ్రీరమణా! భవన్మురళి । చేఁబ్రణవంబును గర్ణపేయమౌ
ధారను గానముఁ సలిపి । తత్సమయాగతగోపికాళికిఁ
బారము లేని యజ్ఞతలు । పాడఱిపోవఁగ జ్ఞానభక్తుల
వ్యాప్తిగఁ గల్గునట్లుగ నె । బాసనఁ జెప్పవె! వేంకటేశ్వ॥

ఉ॥ ప్రాక్తనజన్మమందు ముని । వర్యులు నీపరిరంభణంబులా
సక్తినిఁ గోర సాంప్రతము । సాంప్రత మీరలు గొల్లగొల్లలై
యుక్తి జనింపఁ గృష్ణుఁడన । నుద్భవ మందెద నంచు బల్కి నీ
వుక్తవిధిం దదిష్టముల । నోర్పునఁ దీర్పవె? వేంకటేశ్వ॥

ఉ॥ ఇత్తఱి "గ్రంథశోధక ఋ । ద్ధేంద్రులమేమని" కొందఱీవు మే
నత్తను రాధ నంచుకొని । హాయిఁ జరించితి వంచు దూఱఁగా
వత్తురు గాని యాయమ భ । వత్సహధర్మిణి, శక్తిరూపయై
యత్తి చెలంగ నిట్లనుట । యన్యముగాదొకో? వేంక॥

ఉ॥ జారుఁడు జోరుఁడంచు నిను । జల్పన సేతురు నీదుసత్కథల్
జారమలిమ్లుచక్రియల । సల్పఁగఁ గొల్పెద వంచుఁ గొందఱే

శేరో వచింతు రారయుఁగ । నింతుల తోడుత నాటలెల్ల నీ
యూఱవయేట నాడితివె! । యనన్యముగాదొకో వేంక॥

ఉ॥ ఏడువ గొల్లలందఱు మ । హేంద్రుఁడు తన్నవవారిదంబుల
న్లేడు దినంబులన్ గురియ । నిచ్చుటఁగాంచి ప్రియంబుతోడ మీ
రీడకు రండటంచు గిరి । నెత్తవె! చిట్కెనవ్రేలుచేత నీ
యేడవయేట బంతివలె । నేరికిసాధ్యము? వేంకటేశ్వరా॥

ఉ॥ భ్రాతను గూడి రమ్య మధు । రానగరంబును జేరి పౌరులన్
నాతులఁ బ్రీతిజేసి కడు । నడ్డిని గూనిని గుంటుగల్గు కు
బ్జాతనువున్ సురూపముగ । సల్పి యనల్పునిఁ గంసుఁ ద్రుంచి నీ
తాతకుఁ దల్లికిన్ బహుము । దంబును గూర్పవె! వేంక॥

ఉ॥ నీసతి సత్యభామ తమి । నిన్ను ఘుమంఘుమహృద్యవాసనా
వాసితపారిజాతసుమ । వైభవలాభము గూర్పవే! యనన్
వాసవనందనోపవని । భాసిలుచుండెడి పారిజాతమున్
వాసిగఁదెచ్చియిచ్చి బహు । భద్రముగూర్పవె! వేంక

చం॥ ఇతర మృషాపవాదముల । నేగఁగజేసెడి నీశిరంబుపై
జతురుఁ డెవండొ వేసెను మృ । షాపజనశ్రుతి, దా
హిరణ్యగ

మతిని దలంచి పోరియు శ । మంతకసన్మనః దెచ్చి
యీయవే!
ప్రతికృతిగా సతీమణులు । రా గ్రహియింపవె? వేంక॥
చ॥ అలధృతరాష్ట్రసన్నిధికి । నామెయిఁబోయియు నట్టి
చక్రవ
ర్తులను గణింపకుండఁగుల । దూరితతద్విమరాలయంబు
వం
దలరుచు గంజ గ్రోలితి వ ।హా! తెలిసెన్ భవదాశయం
బెటన్
గలుగునో మంచిబత్తి యటఁ । గన్పడుచుందువు వేం
ఉ॥ సోదర! కృష్ణ! నీవెచటఁ।జూచుచునుంటివో కాని ధార్త
ష్ట్రులు పూజ్యపూజిత మ । హాసభ దుర్ణయులొాచు
నన్నునీ
సోదరిఁ జీరలొల్చివెతఁ । జొన్పుచునుండిరి నీవె దిక్కనఁ
గాదయ ద్రౌపదీసతినిఁ । గ్రక్కనఁగానవె! వేంకటేశ్వ
ఉ॥ శ్రీదయితా! పృథాసుతవి । శేషవచస్సుల వింఁ
ధార్త
ష్ట్రులఁజేరి సంధివిష ।యాత్మకవార్తలఁ జెప్ప వారు
మోదరుఁ జేయఁగా యతన । ముంబొనరించుటఁ గా
కన్న
ద్భేదకవిశ్వరూపము న । తిత్వరఁభూనవె! వేంకటేశ్వ

ఉ॥ అన్నలఁ దమ్ములన్ గురుల । నాప్తులఁ బుత్రుల నస్మదీ
యులన్
గ్రన్నన నెట్లు చంపుదుఁగ । రంబు చలింపదిఁ కేమి సేతు నం
చన్నరుఁడన్న శాత్రమును । వ్యర్థముబుత్తురె. చేయు వే
యునిన్
మున్నొనరింపరే యని సు । బుద్ధులఁ జెప్పవె! వేంకటేశ్వ॥

ఉ॥ ధర్మవిచారణావిధి య । థావిధిఁ బార్థుని గూర్చి తెల్పవే!
కర్మము, భక్తి, జ్ఞానమును, । గా)లెడి గీతల బోధఁ జేయవే!
నిర్మల విశ్వరూపమును । నివ్వెఱబొందఁగఁ జూపి శాత్ర స
త్కర్మకుసల్పవే! నిగమ । గమ్యసురేశ్వర! వేంకటేశ్వ॥

ఉ। భారత వీరశాంతనవ । పౌరుషనిర్గత శస్త్రతీక్ష్ణతా
ధార లెఱింగి పార్థ! యిఁకఁ । దాళవుపోరునఁబొమ్మటంచుబ
ల్పౌరుష సాహ్యముల్గొలిపి । వైరుల రూపుల మాపఁ జేసి
బృం
దారకనాథపుత్రునకుఁ । దజ్జయమీయవె! వేంకటేశ్వ॥

ఉ॥ శంతనుపుత్రుఁ డంపగుమి । శయ్యఁబరుండియు డెంద
మందు ని
శ్చింతగ నిన్నుధ్యానమును । జేయఁగ మెచ్చుచుఁ గోర్కె
లిచ్చి ప్రా

ణాంతము దాఁక నుండి ఘన । మైన పరంపద మీయవే! రమా
స్వాంతసరోజభాస్కర! య । పారదయాకర! వేంక॥
చం॥ పుడమిని నుండు భూపతుల । పోఁడిమిఁ బొంది సవంబు నందుఁ గృ
ష్ణుఁడె తొలిఁబూజ్యుఁడంచు యమ । సూనుఁడు పూజలఁ జేయుచుండఁ గ్రూ
రుఁడు శిశుపాలుఁడమ్మెయి వి । రోధముగాఁ బలుకాడ వాని నీ
సుడిజిగివాలునన్ దునిమి । శోభిలుచుండవె వేంక॥
ఉ॥ లావురవంత లేను కను । లా కనరావు బలంబుతగ్గె నా
కావులఁదప్పెఁ బ్రాణములు । డస్సితి లెస్సగ నీసరస్సునన్
దేవ! తటాలునంగనవె: । దిక్కెవరింకను రావె: ప్రోవవే!
చేవడి నన్ను నాకరినిఁ । జేయవె! స్వస్థగ వేంకటేశ్వరా॥
చం॥ తన పృథుకంబులన్ మనుచు । దారిగనుంగొనఁ బత్ని వేఁడఁగాఁ
జనిగిన చేలమందునఁ గు । చేలుఁడు దాఁబృథుకంబుఁ గాన్కఁగాఁ
గొని నినుఁజూడ రాఁ జెలుని । కోర్కె మదిన్ దలపోసి కాన్కఁగై
కొని ధనధాన్యసంపదలఁ । గూర్పవె! చెల్మిని వేంక॥

ఉ॥ నాయన! కృష్ణ! నీగుణగ । ణంబులు వర్ణ్యములెంతొ గ్రంథమో
యాయతమయ్యెఁ బాండితియు । నంతగ లేదు క్షమంబు సున్న యా
ఖ్యానము సాగరావధి యిఁ । కెట్టులఁ జేతు మరేమొ నర్తు నా
రాయణ! నానతుల్ గొని ర । యంబునఁ బ్రోవుము! వేంక॥

* బుద్ధావతారము *

ఉ॥ నీచులుగూడ యజ్ఞముల । నింద్యవిధంబున సల్పుచుండుటన్
జూచి జగాన బుద్ధుఁడని । సూరులు పిల్వఁగ బోద్ధవౌచు నా
లోచనచేసి సన్ మఖము । లున్ బుధనుత్యములౌనె? మీరలున్
యోచన సల్పుఁడంచు నని । యొయ్యన మాన్పవె! వేంక॥

* కల్క్యవతారము *

ఉ॥ వర్ణములందు సంకరము । వర్తిలినప్పుడు వేదశాస్త్ర సూ
త్రార్ణవ శుష్కకాలమయి । నప్పుడు నీ వల శంభళా పురి
స్వర్ణితవిప్రమందిరము । నన్ ప్రభవింపవె! ముందుఁ గల్కివై
దుర్ణయులన్ దెగన్ దునిమి । తోషము గూర్పవె! వేంక॥

* తిరుపతి వేంకటేశ్వరస్వామి, ప్రార్థనము *

ఉ॥ అంకిలిఁబడ్డ వారలను । నాథుల, వ్యాధుల, నొచ్చువా
రలన్
మంకుతనంబునన్ దిరుగు । మానవులన్, దమిఁబ్రోవఁగా
"కలా
వేంకట నాయకో", యని వి । వేకులు సన్నుతిసేయు
చుండఁ ద
ద్వేంకటపర్వతంబున ధృ । తిన్ వసియింపవె! వేంక॥

చం॥ పరుషుని నొక్కనిన్ జనక! । వారినిఁదెమ్మిటు దాహ
మాయె నం
చఱగొఱలేక వేఁడితివ । హా! చెఱువొక్కటిఁ ద్రవ్వఁ
జేసి వే
శిరమున మట్టిమోసితివి । చెత్తనుగూడిన పూలదండ నీ
శిరమునఁ దాల్చియున్ బహు సు । శీలుఁడవైతివె! వేంక॥

చం। సిరి చెలియై సహస్రవసు । శేఖరుఁడే గృహమై మణీగణా
కరుఁడొగి మామయై యమర । కాండము సేవక జాలమై
మనో
హరకరుఁడైన యా కువల । య ప్రభువర్యుఁడు స్యాలుఁ
డై చెలం
గ రహిఁ వసించియుంటివి జ । గత్ప్రియభాసుర! వేంక॥

చం॥ చెఱను సమస్తకష్టములఁ । జెందుచు స్వీయకళత్రపుత్రులన్
గరము దలంచునట్టి నరు । కైవడి నీభవసాగరంబునన్
దారలుచు బాధలొందియెది । దోఁచకయుండెడు నైన నాకు నీ
చరణసరోజముల్ దలఁచు । సన్మతినీయవె! వేంకటేశ్వరా॥

చం॥ పవలును, రేయి, సాయము, ప్ర । భాతము, చైత్రము, ఫాల్గునంబు, వే
సవియును, శీతకాలమును, । సారెకు వచ్చును, గాలమాడు, నా
యువుజనుచుండె, నిప్పటికి । నుత్కటమైన మనోరథంబు నాఁ
బవనము వీడకుండెఁగద! । పండితసన్నుత వేంకటేశ్వరా॥

చం॥ జననికఠోరవాక్తతిని । శాతశరంబుల నొచ్చి కాననం
బును జని నిన్నుగూర్చి తప । మున్ బొనరించి ధ్రువుండు సద్గతిన్
గనఁడొకొ? చిన్నిప్రాయమున, । గారుణికోత్తమ! నిన్నువిశ్వసిం
చిన గుణి కీ ప్రపంచమున । నెయ్యదిగానిది? వేంకటేశ్వరా॥

ఉ॥ పుట్టినదాదిఁ గష్టములఁ । బూర్తిగఁజెందితి నెన్నడేనియున్
బుట్టుమటంచు నొక్కసుఖ । పద్ధతి గల్గక పోయె నాకు; నే

నెట్టుల నీభవాంబునిధి । నీదుదునోయి! దయాపయోనిధీ!
గట్టిగఁజెప్పి నన్నిపుడు । గావవె! శ్రీధర! వేంకటేశ్వరా॥

ఉ॥ ఇంతగఁ దుచ్ఛమైన జని । యీవల కిప్డెఁక ముందుగూడనే
పొంతను బుట్ట దంచుఁబరి । పూర్తిగఁజెప్పె దనిట్టి నామన
శ్చింతలు నీతిబాధలును । జీదఅ లేడ వసించుఁబాపక్రి
ధ్వాంతవిమర్దనద్యుమణి! । ధర్మజవందిత వేంకటేశ్వరా॥

చం॥ ధరపయిఁ గన్నకొల్దిని య । థార్థము పల్కుట శూన్యమాయె ధ
ర్మరతియుమాయమాయె శ్రుతి । మాన్యత నాశనమాయె మాతృస
ద్గురుపితృభక్తియుఁ దయయుఁ । గుంఠితమాయె నసహ్యభావమే
కరము జనించె నీవెగతి । గావునఁగావవె వేంకటేశ్వరా॥

ఉః పాపుఁడఁబాప కర్ముఁడను । బాపభవుండను బాపసంగుఁడన్
బాపశరీరి నీదయకుఁ బా । త్రుఁడగాని జడుండనైన నిన్
బాపహరుండవంచు నతభక్త । శరణ్యుఁడవంచు వించిటుల్
నీపదపద్మముల్ దలఁచి । నిల్చితిఁగొల్చితి వేంకటేశ్వరా॥

చం॥ పరగఁగుచేలుపైఁ విదురు । పై, బలిపై, దుపదాత్మజాతపై
నరుపయి నంబరీషుపయి । నారదుపై, వ్రజగోపికాళిపై

గరిపతిఁ, బుండరీకుఁడు, । ద్రౌపదియు, నందునిపై,
నహల్యపై
వఱలు కృపారసాన నొక । పాలిడి ప్రోవుము? వేంక॥

ఉ॥ ఒంటినిఁ జేయరాని పను । లోలిగఁ జేసితిఁ జేయుచుంటి నం
చంటిని దాపపాపముల । నంత మొనర్చు మటంచు వేఁడఁగా
నుంటిని. సర్వకోశముల । నుత్తమ దేవుఁడ వీవె యంచు నేఁ
గంటిని మ్రొక్కుచుంటిఁ దమిఁ । గంటనుగాంచవె! వేంక॥

చం॥ నరకమునందుఁగాని మరి । నాకమునందునఁగాని వెండియు
న్ధరణిని గాని యట్టి గగ । నంబునఁగాని మరెందుఁగాని నా
కిరువు ఘటించినప్పటికి । నీవనుకంపఁ ద్వదీయనామసం
స్మరణ, పదాబ్జ భక్తుల న । జస్ర మొసంగవె! వేంకటేశ్వ॥

చం॥ అనఘ! ప్రియాదిసంగతి త । దంబర పట్టణ కల్ప మర్థయౌ
వనములు మేఘతుల్యములు । స్వప్రియబంధుతనూజపు
త్రికా
తనువులు విద్యుదాభములు । దాన, మదిన్ ధృతిపోయెఁ
గాన నా
మనవి మహాత్మ' విను । మా! కనుమా! దయ వేంకటేశ్వ॥

చం॥ ఎవఁడు సమస్తవిష్టప మ । హేశ్వరుఁడో యెవఁడాదిపూరు
షుం
డెవఁడు సనాతనుండో మరి । యెవ్వఁడు కారణకార
ణుండో యూ

ప్రవిమలు, నాపరేశు, నల । బ్రహ్మాను నాశ్రుతిశాస్త్ర
వేద్యు నా
యవితథధీరు నిన్ను శర । ణంచు నుతించెద వేంకటేశ్వ॥

ఉ॥ శారదచంద్రికారజత । శైలవిభాసురసుస్మితా! నమ
స్కార మవక్రవిక్రమ! య । కారణకారుణికోత్తమా!
నమ
స్కారము కౌస్తుభాదిమణి । కంకణరాజితమాధవా!
నమ
స్కారము, భక్తవత్సల! ఖ । గప్రభువాహన! వేంక॥

ఉ॥ శ్రీదయితాయ పాండవ వి । శేషహితాయ నిరంజ
నాయ తే
సాదితపూతనాయ ఘన । సారమృగీమద వాసనాయ హా
రాది సుభూషితాయ పరి । రక్షితమానిజనాయ దంతః
క్రాది విదారణాయ వర । దాయ నమోనమ,, వేంక

* ఉపసంహారము *

చం॥ మునుపు మహామహుల్ కృపుల । ముచ్చట గ్రంథము
లెం రచించియుం
దనుపరు నన్నుగాని యింక । దన్పుదు వే: కతిపద్యరాశి నం
చనకుము మంచిబత్తి నిడు । నట్టిది గాన దయార్ద్ర దృష్టి దీ
నిని గొని నాయఘంబులను । నెట్టవె: ప్రోవవె! వేంక॥

ఉ॥ వ్యాకృతిరాదు, వేదము ర । వంతయురాదు స్మృతీతిహా
సముల్
దాఁకఁగలేదు, శాస్త్రముల । తట్టున జూడఁగలేదు, పండితా
నీకము గొల్వలేదు త్వద । నుగ్రహ ముండుట నేమొ యేవొ ప
ద్వ్యాకృతిగా రచించి యిడి । యంజలిఁ జేసితి, వేంకటేశ్వ॥

చం॥ కవివరు లెందఱో కలరు । కబ్బము లెన్నిటొ కూర్చి తెచ్చి నీ
కవితధభక్తి నిచ్చి పర । మార్థము జెందిరి నాకు నట్టి స
త్కవితయు గాని చాతురియు । గాని భవత్పద భక్తిగాని లే
మి వగచి వేఁడుచుంటిని సు । మీ! ననుగావుమి! వేంక॥

చం॥ చివుకుల సుబ్బయాఖ్యునకు । స్వీకృతపుత్రుఁడఁ గామ
సూనుఁడన్
భవదమలాంఘ్రి పద్మయుగ । బంభర భూతుఁడ నాంధ్ర
గర్గ భా
గవతకృతిప్రణేతఁ గవి । కాండవిధేయుఁడ బ్రాహ్మ
ణుండ నేఁ
దవిలి యొనర్చు మ్రొక్కులను । దప్పక కైకొను వేంక॥

వం॥ జనులకు స్వస్తిగావుత ర । సావిభుఁడుర్వి నయరీతి రాజ్యపా
లనమును జేయజాలుత ని । లాబుధగోతతికిన్ శుభంబు
లున్

దనరుత సర్వలోకముల । నామయ సౌఖ్యమయంబులై
సతం
బునలరుఁ గాక! నీకృప; స్వ । భూ! ప్రతిభాకర! వేంక॥

ఉ॥ ఇమ్మెయి దేవదేవ! హరి! । యెట్టులొ రెండు శతాలపైని ప
ద్దెమ్ముల నీపయిన్ బలికి । తిన్ గద యీకృతియందు
నెట్టి దో
షమ్ములునున్న వత్సలత । సాధువులన్ బొనరించి నాదు జ
న్మమ్మును సార్థకంబుగ నొ । నర్పగ నేడితి, వేంక॥

శ్రీభారద్వాజసగోత్రోద్భవుండును శ్రీనివాసాపర
నామధేయుండునగు చిపురుల అప్పయ్యశాస్త్రిచే
రచింపఁబడిన వేంకటేశ్వరవిజ్ఞప్తి సంపూర్ణము.

ఓంతత్సత్. శ్రీకృష్ణార్పణమస్తు.



# తప్పొప్పులపట్టిక

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 6 | 16 | ద్ధండ | ద్దండ |
| 7 | 3 | నలో | సలో |
| 11 | 5 | తీక్షు | తీక్ష్ణ |
| 16 | 16 | కులస్థులనకో | కులస్థునకో |
| 17 | 13 | యూావసం | బాంధవం |
| 26 | 19 | జేతురిది | జేయునిది |
| 32 | 7 | నాథ్యాం | నాద్యాం |
| 34 | 10 | పాలరక | పాలక |
| 35 | 18 | లేనని | లేని |
| 36 | 18 | సెంచి | పెంచి |
| 39 | 16 | నివే | వివే |
| 40 | 7 | మనాధ్య | మాంధ్య |
| ,, | 10 | దృధ | దృఢ |
| 59 | 14 | కృష్టు | కృష్ణు |
| ,, | ,, | నర్యు | వర్యు |
| ,, | 17 | ఒహు | బహు |

ఇవిగాక న, స, ప, వ, ర. అ, ల ళ, ల యొక్క వ్యత్యాసములను సవరించుకొన ప్రార్థితులు.

# ఇతరగ్రంథములు.



| | | |
|---|---|---|
| బాలనీతి మొదటిభాగము | మనోహర | 0-8-0 |
| బాలనీతి రెండవభాగము | కథలుగలవు | 0-6-0 |
| నీతికల్పలత మొదటిభాగము | అపూర్వము | 0-5-0 |
| నీతికల్పలత రెండవభాగము | | 0-5-0 |

సాంధ్రలక్ష్మీ నృసింహస్తోత్రము. శంకరాచార్య కృతికి తెలుగుసేత - భక్తిరసభరితము. 0-2-0

ఆంధ్రరథాంగదూతకావ్యము శ్రీకాళిదాసకృతికి తెలుగు శృంగారరసము. 0-6-0

దయానందకాకచ్చాచిత్తా, ఆర్యసమాజపద్ధతులు తెలియును. జె. కృష్ణయ్య. 0-1-0

రెండవకూర్పుబడనున్నవి.

రజస్వలా వివాహఖండనము.

వర్ణవ్యవస్థ.

వలయువారు:—

మారుతిబుక్కుడిపో

4001 తాడిమార్కెటు శికింద్రాబాదు దక్క

## మా స్వంత ప్రచురణములు.

### శిరోమణి.

సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారిచే రచింపబడినవి.

| | వెల.-రు. | -అ. | -పై. |
|---|---|---|---|
| ఆంధ్రప్రబంధకథలు | 0 | 12 | 0 |
| కావ్యమాల | 0 | 12 | 0 |
| కుమారి | 0 | 1 | 6 |
| తత్సమచంద్రిక | 1 | 0 | 0 |

వ్యాసమాల (అచ్చులోవున్నది)

ఉస్మానియా ఆంగ్లో తెనుగు ప్రైమరు (అచ్చులోవున్నది)

వలయువారు

## మారుతీబుక్కుడిపో,

బుక్ సెల్లర్సు అండ్ ఎడ్యుకేషనల్

పబ్లిషర్సు:

మార్కెటువీధి సికిందరాబాద్.